గ్లెబోవ్, అనటోల్

సోవియట్ స్త్రీ

రాజమండ్రి, 1943

Record no. 97

Glebōv, Anaṭōl

Sōviyaṭ strī

Rājamaṃḍri, 1943

Record no. 97

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

Bibliographic Record Target

గ్లెబోవ్, అనటోల్.
సోవియట్ స్త్రీ / రామమోహన్. - రాజమండ్రి: శ్రీ కొంపల్లిప్రెస్, 1943
104 p. ;17 cm.
Record no. 97

Glebōv, Anaṭōl.
Sōviyaṭ strī / Rāmamōhan. - Rājamaṃḍri: Śrī Koṃpallipres, 1943
104 p. ;17 cm.
Record no. 97

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB Date filming began:

# సోవియట్ స్త్రీ

(అనటోల్ గ్లెబోవ్)








అనువాదం

రామమోహన్

రచన : 1928

నాలుగు అంకాలూ : పదమూడు రంగాలూ.

| | |
|---|---|
| ఆంగ్లానువాదం : 1934 | ఆంధ్రానువాదం : 1941. |
| ఇంగా | సోవియట్ స్త్రీ |
| ఛార్లెస్ మాలాముత్ | రామమోహన్ |

శ్రీ కొండపల్లి ప్రెస్, రాజమండ్రి.
1943



వెల ౧౨ అణాలు

## గ్రంథకర్తను గూర్చి రెండు మాటలు.

గ్లబోవు పుట్టుక 1899. ఒక పత్రికా కార్యాలయంలో ప్రూఫ్‌రీడర్‌గా పదిహేనోయేటనే కుదిరేడు. విప్లవకాలంలో రెడ్-గార్డులలో చేరేడు. అటుతరువాత కమ్యూనిస్టుపార్టీలో - ప్రభుత్వంలో - ట్రేడ్‌యూనియన్లలో - సైన్యంలో - పత్రికాప్రపంచంలో - రాజకీయాలలో ఎన్నో పూచీగలపదవులు నిర్వహించేడు. కాని, ఆతడు నాటకరచనయందే ఎక్కువ అభినివేశం చూపేడు. 1930 నాటికే ఆతడు 16 నాటకాలు వ్రాసేడు. వాటిలో జగ్‌మక్; గ్రోత్, ఇంగా; పవర్; గోల్డ్ అండ్ బ్రెయిన్ అనేవి మంచి పేరుపడ్డాయి. ఇతడు వట్టి కలంపోటుగాడే కాదు. రష్యాలో వాఙ్మయాభివృద్ధికీ - ప్రచారానికీ - నిర్మాణానికీ పాటుపడుతూన్న వారిలో అగ్రగణ్యుడు.

ఆతడు వ్రాసిన 'ఇంగా' - నే నాటకానికి ఇది అనువాదం. ఇంగా 1928 లో వ్రాయబడింది. ఒక్క మాస్కో థియేటర్‌లోనే ఇది 250 మార్లు నటించబడిందంటే దీని ప్రాశస్త్యం తెలియవస్తుంది. బెర్లిన్‌లోకూడా దీనికి మంచిపేరు ఏర్పడింది.

'సోవియటు స్త్రీ: నూతనులమధ్య పూర్వపుస్త్రీ, పూర్వపుస్త్రీల మధ్య నూతనురాలు." ఇదీ ఇంగాయొక్క కల్పన, గ్రంథకర్త చెప్పినట్లు. నూతనసమిష్టిసమాజంలోని కుటుంబసమస్యలు - ప్రేమసమస్యలు - దైనందిన గృహజీవితసమస్యలు దీనిలో చక్కగా వివరించేడు.

నాటకంపేరు 'ఇంగా' అయినా ప్రాధాన్యత గ్లఫీరాది. వంటయింటి పొగలనుంచి తీసుకువచ్చి, స్వతంత్రురాలు, స్వాధీనురాలుగానూ తయారుచేయబడిన గ్లఫీరాదినాటకంలో ప్రాధాన్యత. ఆమెలో రాజకీయ చైతన్యం కలిగినా మాతృత్వం పోలేదు, "ప్రకృతిని త్యజించకుండానే స్త్రీ పురుషునితో సమానురాలిగా వుండాలి," అనే సోవియటు ఆదర్శాన్ని గ్రంథకర్త ఆమెలో చిత్రించేడు.

1—1—1941 అనువాదకుడు.

ప్రదేశం: సోవియటు సోషలిస్టు రిపబ్లిక్కు యూనియనులోని
పెద్దపారిశ్రామిక నగరాలలో ఒకటి.

సమయం: ప్రథమ పంచవర్ష ప్రణాళికనాటిది.

ఎప్పటిలాగే ఉండమనెదవా?
అడగిమడిగి, నే పరాధీననై
దెబ్బలుతింటూ, పడివుండేదా?
ఒక్కొక ఏడే పైబడుకొలదీ
మహాతరంగముల మారుదెబ్బలకు
పూర్వపురోజులు మాసిపోయినై!
గుండపిండియై కరిగిపోయినై!!.......
నీతో సమానఫాయాగా నే
పోరాటంబున, పనిపాటలలో
మిత్రమనై, సమానఉజ్జానై
ధైర్యముతో ఆదురదృష్టాన్ని
మృత్యుపీడనని ఎదిరించెదను!
ప్రేమకిమాత్రమె హృదయమునిస్తా!!
అదిఏలావుంటుందంటావోయ్!

నద్జాదా పాలోవిచ-

# పాత్రలు.

ఇంగామార్చినోవారిజ్జర్: 30 ఏళ్ళుంటాయి. పొడుగ్గా, బలంగావుంటుంది. అందమైన విగ్రహం, శుభ్రమైన దుస్తులు - కమ్యూనిస్టు ఇంటలెక్ట్యుయల్ - దుస్తుల ఫ్యాక్టరీ మానేజరు.

డిమిత్రీగ్రిచానినోవ్: 35 ఏళ్లవాడు. కండలుదేరిన శరీరం. అందమైనవాడు. ఉద్రేకం - తొందరపాటుగలవాడు - కమ్యూనిస్టు శ్రామికుడు, ఫ్యాక్టరీ కమిటీకి అధ్యక్షుడు.

గ్లఫీరా: అతని భార్య. 32 ఏళ్ళది - కుట్టుపని చేయగలదు. అచ్చంగా పల్లెటూరివాటం.

మిరాగర్విచ్: వయస్సు 35. నలుపు. సలాకులావుంటుంది. అతిచురుకుగా వుంటుంది. విప్లవంకోసం స్త్రీత్వాన్నికూడా మరిచిపోయినరష్యాన్-యూదు ఇంటలెక్ట్యుయల్సు తరగతి మనిషి. స్త్రీశాఖకి ఆర్గనైజరు.

సోకూవ్, గ్రిగరీడానిలిచ్: వయస్సు 60. నాజూకుగా వుంటాడు. అలిసి వుంటాడు. పూర్వకాలపు కమ్యూనిష్టువర్కరు. స్థానిక కమ్యూనిష్టు పార్టీకలెక్టివుకి కార్యదర్శి.

రైజోవ్, ఇగ్నట్ ఇవానోవిచ్: 40 ఏళ్ళవాడు. బొద్దుగా, బలంగా, గంభీరంగా వుంటాడు - దురభిమానం గలవాడు - ఎర్రని బిరుసు మీసాలు - సరిపడని విదేశీయ వేషం - కమ్యూనిష్టువర్కరు-ఫ్యాక్టరీకి అసిస్టెంటు మానేజరు.

నెమ్ట్సేవిచ్, రోమన్ ఫ్రాన్ట్సేవిచ్: వయస్సు 45. అందమైనవాడు. మిలిటరీమీసవుడు, ఆడవాళ్ళని ఆకర్షించేకళ్ళు. కాలేజీలో తరిఫీదు నొందిన ఇంజనీరు.

వెరోనికా: అతనిభార్య - 35 ఏళ్లది - జారిపోతూన్న యౌవనం - అలం

టోల్డికోవ్, సోఫ్రొన్: ఏభైఏళ్ళవాడు. పొట్టిగా, బొద్దుగా, మందకొడిగావుంటాడు. ఒత్తయిన కనుబొమ్మలు. ఉదారంగు - చప్పిడిముక్కు - తాగుబోతు - పూర్వకాలపు బానిపనివాడు - స్త్రీల దుస్తులషాపులో మేస్త్రీ.

నాస్త్యా: ఆతనిభార్య. 40 ఏళ్ళది. తిట్టుబోతు కాని, దయగలది.

సవ్రాష్కిన్: వయస్సు 65 - శుభ్రంగా సన్నగా గీయించిన గడ్డంతో వున్న ముసలిపనివాడు.

ఫ్యాక్టరీలో పనిచేసే స్త్రీలూ - పురుషులూ - ఇంకా.

# రంగసూచిక.

**మొదటి అంకంలో:**

ఒకటోరంగం: ఫ్యాక్టరీక్లబ్బులో.
రెండోరంగం: క్లబ్బువెలుపలనున్న ఫలాహారశాలలో.
మూడోరంగం: ఫ్యాక్టరీసభామందిరంలో.
నాలుగోరంగం: ఫ్యాక్టరీ మేనేజరు ఆఫీసు.
అయిదోరంగం: సహకారవసతిగృహాపు మెట్లగదిలో.
ఆరోరంగం: సహకార వసతిగృహంలో ఇంగా గదిలో.

**రెండో అంకంలో:**

ఏడోరంగం: గ్రిచానినోవుగదిలో.
ఎనిమిదోరంగం: అదే.

**మూడో అంకంలో:**

తొమ్మిదోరంగం: ఫ్యాక్టరీ కుట్టుపనిశాలలో ఒకభాగంలో.
పదోరంగం: ఫ్యాక్టరీలోని స్థానిక కమ్యూనిష్టుపార్టీ ఆఫీసులో.
పదకొండోరంగం: ఫ్యాక్టరీలోని 'రెడ్ కార్నర్' లో.

**నాలుగో అంకంలో:**

పన్నెండోరంగం: ఫ్యాక్టరీ అసిస్టెంటు మానేజరు ఆఫీసులో.
పదమూడో రంగం: ఫ్యాక్టరీ మానేజరు ఆఫీసు.

## మొదటి అంకం—ఒకటోరంగం.

[దుస్తుల ఫ్యాక్టరీయొక్క క్లబ్బు గది అంతటా జెండాలు; స్ట్రీమర్లు; పోస్టర్లు; అతికించి వున్నాయి. వెనకగోడకి నట్టనడుమన ఒకదానిప్రక్క నొకటి లెనిన్-స్టాలిన్ల పటాలు రెండు వ్రేల గట్టబడియున్నాయి. ఇంటియాగని పాతమార్చే విధానాన్ని తెలిపే 12 బొమ్మలతోనున్న పోస్టరు ఒక గోడనుంది. ఇంకో పోస్టరు మీద—"రెండుకి రెండు కలిపితే అయిదు. అయిదేళ్ళఅంచనా నాలుగేళ్ళలోనే పూర్తి చేయాలి." అని వ్రాయబడి వుంది. స్ట్రీమర్లమీదకూడా హెచ్చరికలు ముద్రించబడివున్నాయి. "సోషలిస్టుపోటీకి నిలబడండి!"—"ప్రతి ఫ్యాక్టరీ ఒక్కొక్క సోషలిస్టుకోట"—"షాక్-బ్రిగేడ్లకి ప్రోత్సాహం కలుగచెయ్యండి" - ఒకపెద్ద తెరమీద - "నాలికమడతగాళ్ళనీ - స్వార్థపరుల్నీ; దిగపీకుడుగాళ్ళనీ; ఆశపరుల్నీ; తరమండి!" మనదేశంలో సోషలిజం స్థాపించడానికి సాగిరండి!! పార్టీయొక్క కార్యక్రమాన్ని సాగించండి! లెనిన్ శిష్యులలో అగ్రగణ్యుడైన కామ్రేడ్ స్టాలిన్ చిరంజీవియౌగాక!!!" - అని వ్రాయబడి వ్రేలాడగట్టబడి వుంది.

కుడివేపు ద్వారం తలుపుకున్న అద్దంమీద నల్లని అక్షరాలలో Club అని తల్లక్రిందులు అక్షరాలలో వ్రాయబడివుంది. ఎడమవేపున వున్న ద్వారం ఫలహారమందిరంలోకి వుంది. లెనిన్ స్టాలిన్ల బొమ్మలకి సరిగ్గా క్రిందుగా పెద్దద్వారంవుంది. దానికి ఎదురుగా కొంచం కుడివేపుగా చిన్నవేదిక కట్టబడివుంది. వేదికమీదఒక టేబిలు, మూడుకుర్చీలూవున్నాయి. వేదికముందు కుర్చీలు వరుసలుగా వేయబడియున్నాయి. వానిమీద ఫ్యాక్టరీపనివారు కూర్చుండివున్నారు. అధ్యక్షపీఠంమీద సోమోవు వున్నాడు. ఆయనప్రక్కన 'మినిట్సు' వ్రాయడానికి ఒకస్త్రీ కూర్చుని వుంది. ఫ్యాక్టరీపనివారిమధ్య, క్రైజోవ్, సవ్రాస్కిన్లున్నారు. ఇంగా వేదికమీదనే ఒకప్రక్కకూర్చుని, ఫ్యాక్టరీ స్థితిగతులకి సంబంధించిన రిపోర్టుకి అవసరమైన లెక్కలు వ్రాసుకుంటూంది.)

ఇంగా—కామ్రేడ్స్! ఒక్కచిన్నవిషయం జ్ఞాపకం వుంచుకోండి. నారిపోర్టులోనున్న ఈపొడిపొడి అంకెలున్నాయే అవి వట్టిఅంకెలుకావు. సోషలిజంకోసం జరిపే పోరాటంలో మన యీచిన్నరంగంలో మనం ఓడ్చిన చెమటకీ - ఖర్చుపెట్టిన రక్తానికీ చిహ్నాలు అవి. ఈసాంవత్సరిక నివేదికలో పన్నెండుమాసాలపాటు - మూడువందల అరవైఅయిదు రోజుల పాటు, ప్రతిదినం, ప్రతిగంట, మనంచేసిన తీవ్రపోరాటం వ్రాయబడివుంది. ఈకార్యక్రమం సాగించడానికి ప్రతిపనివాడూ; ప్రతిపార్టీసభ్యుడూ; ప్రతి ట్రేడ్ యూనియనుసభ్యుడూ; ప్రతివాళ్ళూ, తమతమ శక్తి వినియోగించేరు. మనం ఒక్కసైనికదళంలా - ఒక్క 'కలక్టివ్' మాదిరిగా - పనిలో చాతుర్యం సంపాదించడానికి; ఉత్పత్తిని బాగా వృద్ధిచెయ్యడానికి; క్రమశిక్షణ కోసం; ఉత్తమత్వం సాధించడంకోసం; సోషలిస్టు జీవితవిధానంకోసం; పోరాడేము. ఇవి ఎవ్వరో గుమాస్తా తయారుచేసిన పొడిఅంకెలూ కావు!- మనఫ్యాక్టరీలో తయారై దేశంఅంతటా వ్యాపింపచెయ్యబడిన సరుకులంతటినీ ఇవి చూపించడమూ లేదు... ఈరిపోర్టంటే మానవుడికి సంబంధించినది ఇది. దీనిలో ఎక్కువగా మానవునిగురించే వ్రాయబడింది. మనలో ఇంతవరకూ చేరివున్న పాతతుక్కురకంలోంచి దైనందినపోరాటంలో తయారుచేసుకుంటూన్న నూతనసోషలిస్టు మానవునిగురించి దీనిలోవుంది. మనము - మన పార్టీ - మనయొక్క ఇతరనిర్మాణాలూ - ఊహించి, నిర్మించి, తయారుచేసిన స్వతంత్రసోషలిస్టు శ్రామికనాటకం ఇది!......కామ్రేడ్స్! మనం చేసినపనిలో నున్న గొప్పతనం ఇదే. భవిష్యత్తులోకూడా మనదృష్టిని కేంద్రీకరించవలసింది ఇటువేపే!

[హర్షధ్వనులు]

క్రైజోవు—(జనంమధ్యనుంచి) అర్థంలేని ఆదర్శవాదం! మనం యదార్థవిషయాలని తెలుసుకోవాలిగాని, ఈఉపదేశం ఇవ్వడంలో ఏమీ అర్థంలేదు. (సభలో కలవరం బయలుదేరుతుంది.)

ఇంగా—కామ్రేడ్ క్రైజోవ్! నిన్నుగురించి ఇంతవరకూ చెప్పింది చాలు. మనలో పాతతుక్కు వుందన్న మాటకి నువ్వే ప్రత్యక్ష ప్రమాణం.

రైజోవు—(ఉద్రేకమూ, కోపమూతో, వేదికమీదికి వురుకుతాడు.) మనలోనా? అయితే నీమాటేమిటి? కామ్రేడ్ మేనేజరు! నువ్వెందులోదానివి?

ఇంగా—(తన కాగితాలపైపై దబ్బునమూసి, వేదిక దిగబోతూ) నేనేం అదర్శవ్యక్తినని చెప్పుకోవడంలేదు. నేనూ అందరిలాంటిదానినే. నాలోనూ లోపాలుంటాయి.

రైజోవు—అయితే నీబాకా ఎందుకు? ముందామాట చెప్పు. అందరిముందూ నన్నెందుకు అవమానపరిచేవు? – నేనూ పార్టీసభ్యుడినే – బాధ్యతగల కామ్రేడ్‌నే! – ఏమనుకుంటూన్నావు. ... చవటననుకుంటూన్నావా? ఎవ్వరినో ఒకరిని తిడితేగాని నీకు తృప్తి వుండదు. అందుకే అన్ని తప్పులూ నా నెత్తిని రుద్ది నాకు తాటాకులు కట్టేవు.

[సభాధ్యక్షుడు నియమంకోసం గంటవాయిస్తాడు. రైజోవు వినిపించుకోడు. సోమోవు అతనివద్దకేవచ్చి చెవిలో గంటవాయిస్తాడు.]

సోమోవు: కామ్రేడ్ రైజోవ్! మాటలాడడానికి నీకు ఆహ్వానం పంపలేదు. పైగా, బహిరంగసమావేశంలో పార్టీసభ్యులవిషయమై ఆవిధంగా నోరుచేసుకోడం ఒప్పుకోము. ఆసంగతి నీకూ తెలుసును. (రైజోవు ఆగుతాడు.)

ఇంగా—నువ్వుచేసిన పొరపాటువలన మనకి ఏడువేలరూబుళ్ళు దెబ్బతగిలింది కనక నువ్వుచేసిన తప్పులు చెప్పేను. కామ్రేడ్ రైజోవ్! ఈవ్యవహారం అందరికీ సంబంధించినది. వ్యక్తిగతవిషయం కాదు, ప్రజలకి సంబంధించినదికాని.

సవూష్కిన్—(హాలులో మూలగా వుండడంచేత మనిషి కనబడడు. వేదికకి దూరంగా నిలబడే అంటాడు.) డానిలిచ్! సోమోవ్!

సోమోవు—(ధ్వనివచ్చినవేపు తిరిగి) ఎవరువారు? ఇంతకుముందే ఎందుకుమాట్లాడలేదు? చర్చ ముగించబడింది. (సభ కలవరంగానే వుంటుంది.)

సవూష్కిన్—(ఇంకా కనబడడు. కాని దగ్గరగా వస్తూండడంచేత ధ్వని బిగ్గరగా వినబడుతుంది.) నేనో విషయం చెప్పాలి. చెప్పవచ్చునా?

సోమోవు—(కేక వేస్తాడు.) చర్చముగిసింది. (గోలలో అతని గొంతుక ఎవ్వరికీ వినబడదు.) సరే! ప్రత్యేకంగా కామ్రేడ్ సవూష్కిన్ మాటలాడడానికి అవకాశం ఇస్తూన్నా.



కోపంతో సోమోవు కుర్చీదగ్గిరికిపోయి కూర్చుంటాడు. ప్రజలంతా సద్దుమణిగేవరకూ గంట అదేపనిగా వాయిస్తూంటాడు. ఇంగా వేదికమీద నిలబడివుంటుంది. రైజోవుకూడా అక్కడేవుంటాడు. సవూష్కిన్ ఉద్రేకపూరితుడై వేదికనెక్కుతూ కోపంతో రైజోవువంక చూస్తాడు.

సవూష్కిన్—నేను మాటలాడతలచుకున్నది ప్రజలకి సంబంధించిన విషయాన్నిగూర్చే కాని నా స్వంతవ్యవహారాన్ని గురించి కాదు. ఇప్పుడు స్వంతవ్యవహారాలు ఎవరికి కావాలి? ప్రజలందరికీ సంబంధించినంతవరకే వ్యక్తివ్యవహారాలు మనదృష్టిని ఆకర్షిస్తాయి (అధ్యక్షునివేపు తిరిగి) ఇదిగో కామ్రేడ్ సోమోవ్! నేచెప్పదలుచుకున్నది విను. ఈవిషయాన్ని గురించి శ్రామికవర్గం విచారించి తీర్పుచెబుతుంది. పార్టీసభ్యులం కాకపోయినా...(సభలో హాస్యధ్వని) ఆగండి! రేపు నేనూ పార్టీలో సభ్యుణ్ణి కావచ్చునేమో! (హాస్యధ్వని) కామ్రేడ్ రైజోవ్! నాఅభిప్రాయం ఒక్కమాటలో చెప్తున్నా విను. కొంచెపాటివిమర్శనని నువ్వు సహించలేకపోతే, నిజంచెబితే అంత ఉక్కిరిబిక్కిరి అయిపోతూంటే, పోనీ నిన్ను మిమన్ను తెమ్మని పంపించిన జర్మనీకే తిరిగిపోరాదూ? అక్కడే సుఖంగా వుండొచ్చుకా. (నవ్వులు, హాస్యధ్వనులు) నీకు సరిపడ్డ సమాజం – ఆసోషల్ డెమాక్రట్లు – అక్కడ నీకు జతకుదురుతారు, వాళ్ళు నీతో ఎంతో గౌరవంగా మాట్లాడుతారు. ఇద్దరూ కలిసి తాగి అభినందనాలు ఆడవచ్చును. కాని, కామ్రేడ్ రైజోవ్! మన్మల్ని మాత్రం ఆమాదిరిపుంతలు తొక్కించకు. ఆధర్మమాయని. ఇదివరకు అనుభవించి దిచాలు. కనక నువ్వు మాతో వుండదలుచుకున్నావా, ఆగుణం వదిలు. నీమంచికోసమే ప్రజలు చేస్తూన్న విమర్శనలని జాగ్రతగా విను. (హాస్యధ్వని)

ఇంగా—శేవ్! సవూష్కిన్! Bravo!

(హాస్యధ్వని). రైజోవు సవూష్కినువంక, ఇంగావంక చూసి హఠాత్తుగా అరుస్తాడు.)

రైజోవు—మీరు – మీ ఆత్మవిమర్శనా...

(రైజోవు పరుగెత్తిపోతాడు. సభఅంతా కలకలం)

[తెర]

## రెండో రంగం.

క్లబ్బువద్దనున్న ఫలాహారమందిరం గోడలమీద పోస్టర్లు అతికించి వున్నాయి. చాలా చిన్నచిన్న మేజాలూ, వానిప్రక్క కుర్చీలూ అమర్చి వున్నాయి. ఒకవైపున పెద్ద 'సామోవరు' వుంది. మాంసపురొట్టెలు; పిండిరొట్టెలు; పళ్ళు; తీపిపదార్థాలు; సిగరెట్లూ అమర్చివున్నాయి. కౌంటరువెనుక నొక స్త్రీ కూర్చుని చదువుకుంటూంది. ఆమె చాలా విసుగుగావున్నట్లు కనబడుతూంది. రైజోవు వుద్రేకంతో, చెమటలు కక్కుకుంటూ లోనికి పరుగెత్తి వస్తాడు.

రైజోవు—నాప్రాణాలుతోడేసింది. ఆడదికాదురా బాబూ. పెద్దపులి! కాట్లకుక్కలా పట్టుకువదలదే. (నుదుటిచెమట తుడుచుకుంటాడు.) మళ్ళీ నేనేన విదేశాలకిపోవాలీ? చచ్చేనురా, బాబూ!

(నెమ్ట్సోవిచ్ ప్రవేశిస్తాడు.)

నెమ్ట్సోవిచ్—ఇగ్నట్ ఇవానిచ్! ఏమైనా కాస్త తమాయించేవా?

రైజోవ్—తమాయించడం ఏమిటి? ఫ్యాక్టరీజనం అందరిముందూ నన్ను అవమానపరుస్తూంటే ఏమిటి నువ్వింకా తమాయించడం అంటావు?

నెమ్ట్సోవిచ్—[illegible]. అట్టేకోపపడకు. సోడాతాగుతావా? టీ పుచ్చుకుంటావా?

రైజోవు—(ఆకోపంతోనే అనుబంధాలబల్లవద్దనున్న స్త్రీతో) ఒకప్లేటు మాంసపురొట్టె తెచ్చిపెట్టు. (బల్లవద్దకివస్తాడు.) శాంతం! హుం!

నెమ్ట్సోవిచ్—(మాంసపురొట్టె, టీ బల్లమీద పెడతాడు.) ఎవరి నేమంటావు? పనికిరానివస్తువులు నిన్నెవరుకొనమన్నారు? ఆ మిషన్లన్నీ మనకెందుకూ పనికిరావు. వాటిని అవతలపారెయ్యమంటావా?...

రైజోవు—గోమర్ ప్రాంట్సేవిచ్! అసలువిషయంఅదికాదు. నేకాదు. నువ్వుచెప్పింది నేనూ వొప్పుకుంటా. అదినాపొరపాటే. కానిదానికీ,



నాకిలుక్కా అందరిలోకీ సంబంధం ఏమిటో చెప్పు. నేను హాంబర్గులో తాగడానికి దానికీ సంబంధం ఏమిటి? అవన్నీ ఎందుకు తవ్వుకురావడం? (కోపంతో గొంతుకొరుకుతాడు.) అక్కడ నేనే పెద్దపెన్ను చేసేను...సరే. (మింగుతాడు.) అదోభోగాలలోపడి చేసేసేను. అవన్నీ ఉత్పత్తికి సంబంధించిన ఈసమావేశంలో ఎత్తడం ఎందుకు? (బల్లగుద్దుతాడు. టీ చిందుతుంది.) నేనూ బాధ్యతగల పార్టీసభ్యుడినే...అసిస్టెంటుమేనేజర్ని. నాలాంటివాడిని ఫ్యాక్టరీ అందరిముందూ కోతినిచేసి ఆడించడమా? వేరా కోశాలా?

నెమ్ట్సోవిచ్—(నెమ్మదిగా నవ్వుతూ టీ చప్పరిస్తూంటాడు.) అది అసలుబాధ! ఎక్కడొచ్చినా, ఎప్పుడొచ్చినా మూలకారణం అదే!

రైజోవు—(ఆమాటలకి అర్థం తెలియకపోయినా తెలిసినట్లు నటిస్తాడు.) అంహా! చూసేవా...అబ్బాయి! నాకు అన్ని సంగతులూ తెలుసును. అసలువిషయం ఒకటి. నన్ను తిరిమి వెయ్యాలి. నా స్థానంలో డిమిట్రీని పెట్టాలి. అక్కడుండేది నేనైనా. అతడైనా ఒకటేనని దానిమీద మేం చెప్తూంది. నేనంటావా. అందరిలాంటి మనిషినే! (తాగుతూ) ఈ కోటూ, ఈపంట్లం, ఈచొక్కా...ఇంతేగా. కాని, అతడు! షోకుగా వుంటాడు; ఏమంటావు!

నెమ్ట్సోవిచ్—నే చెప్తూన్నది అదికాదు!......

(అలా దారికిపోతూ ఎడమవేపునుండి డిమిట్రీ అలాగ వస్తాడు. అతని చేతిలో ఏవేవో కాగితాలు వుంటాయి.)

డిమిట్రీ—(ఒక్కక్షణం ఆగి) జరగకూడని మంగళం ఏదో జరిగిందనుకుంటాను.

రైజోవు—నీపని ఏమవుతుందో చూసుకో. తరువాతవాడివినువ్వేగా.

డిమిట్రీ—వాళ్ళు నన్నేం చెయ్యగలరు? నేనేం నీలాగ విదేశాలకిపోయి [illegible] పారెయ్యలేదు. నేనేం మందకొడిగా వుండడంలేదు. (వెక్కిరింతగా) నేనేం వ్యాపారి సంతతికంటెకాదు!

రైజోవు—(బల్లవద్దనుంచి లేచి) నువ్వు మాట్లాడుతూన్న దెవరితోటో ఎరుగుదువా? ఓమాటు తెలివితెచ్చుకో. ఫ్యాక్టరీ డైరెక్టరువు

అయినంతమాత్రాన నీయిష్టంవచ్చినట్లల్లా మాట్లాడవచ్చుననుకుంటున్నావేమో! జాగ్రత్తగావుండు! నీయిష్టంవచ్చినట్లు మాట్లాడడానికి నేనేం "ఇంగా" ని కాను. (డిమిత్రీకి దగ్గరగావచ్చి) లెంపకాయలు తినగలవు...

డిమిత్రీ—ఇప్పుడు "ఇంగా" మాట ఎందుకొచ్చింది?

రైజోవు—ఎందుకో చెప్తా!

సెమ్యోనొవిచ్—కామ్రేడ్స్! శాంతం!

డిమిత్రీ—ఉండు. (రైజోవుతో) ఏదో ప్రారంభించేవు. అదేదో పూర్తిచెయ్యి. ఏమిటి అంటున్నావు?

రైజోవు—ఫ్యాక్టరీ కమిటీ ఛైర్మన్‌కీ - ఫ్యాక్టరీమానేజరుకీ గల పరిచయాన్ని గురించి... అర్థం అయిందా?

డిమిత్రీ—కామ్రేడ్ రైజోవ్! అలాంటిమాటలన్నందుకు నిన్ను...

రైజోవు—ఏం చెయ్యగలవోయ్, ఏంచేస్తావు?

డిమిత్రీ—ముద్దు పెట్టుకుంటాననుకోకు...గూబకదలేస్తా......

(కుడివేపునుండి ఇంగా వస్తుంది...

ఇంగా—ఏమిటీగోల. (అందరూ కంగారు పడతారు. ఏంజరిగిందేమిటి?

రైజోవు—ఎలాకదలేస్తావో చూస్తా. నా తడాఖా చూద్దువుగాని.

(ఎడమవేపుగా పోతాడు.)

ఇంగా—డిమిత్రీ! అసలు సంగతేమిటి?

సెమ్యోనొవిచ్—సరిగ్గా స్ప్రింగ్‌కి నకలు! శీతోష్ణస్థితులతో పాటు అన్నీ మారతాయనుకుంటున్నావేమో! ఈవేళటిమాదిరి ఉద్రేకం నేనిదివరకెప్పుడూ చూడలేదు.)

(ఓరగంట డిమిత్రీవంక చూస్తూ, ఒకవైపుకిపోయి కూర్చుని టీతాగడం ఆరంభిస్తాడు.

డిమిత్రీ—వాడిమొహం మండిరిలే!

ఇంగా—నీ రిపోర్టు తయారయిందా?



డిమిత్రీ—ఆఁ. ఒక్కక్షణం......నీతో మాట్లాడవలసివుంది. (ఒకవైపుగా తీసుకువెడతాడు.)

ఇంగా—ఏమిటది? త్వరగా చెప్పు.

డిమిత్రీ—నేను నిన్ను ప్రేమిస్తూన్నా...అదే...

ఇంగా—(తుంచేసినట్లు) డిమిత్రీ! ఆమాటంటే వెగటు పుడుతూంది...అదీగాక ఇది సమయమూగాదు. ప్రదేశమూ కాదు.

డిమిత్రీ—మతిలేనట్లు మాట్లాడకు. (ఆపుతాడు.) ఒక్కక్షణం... ఈవేళ నిసింద్రీలావున్నావు. రాకెట్! యుద్ధం రోజుల్లో చూసిం జ్ఞాపకం వుందా! సరిగ్గా...అల్లానేవున్నావు!

ఇంగా—ఈబడాయిలువింటూ కూర్చోడానికి తీరుబడిలేదు. వాళ్లు ఇప్పటికే నాకోసం కనిపెట్టుకుని వుంటారు పోనియ్యి నన్ను.

(ఆమె చేతిని డిమిత్రీ ముద్దుపెట్టుకోబోతూండగా విదిలించుకుని వెళ్ళిపోతుంది. కొంచెం దూరంలో కూర్చున్న సెమ్యోనొవిచ్, అప్పుడే ప్రవేశించిన రైజోవులు అదృశ్యం చూస్తారు. ఇంగా కుడివేపుగా క్లబ్బులోకి వెళుతుంది. డిమిత్రీ వెంబడిస్తాడు.)

రైజోవు—సోమన్ ఫ్రాంత్సెవిచ్! చూసేవూ? హా! చూడు, ఎలావుందో—నేను తాగకూడదట, కాని... మేనేజరు సాహేబా ఫ్యాక్టరీ కమిటీ ఛైర్మన్‌తో పట్టపగలు సరసాలాడొచ్చు. ఈపద్ధతిబాగుందంటావా?...

సెమ్యోనొవిచ్—దానికి నువ్వేం చేస్తావు? అడపడానికి శక్యంగాని శారీరకావశ్యకతలు. మార్క్సిస్టుకి ఫ్రాయిడ్‌మీద నమ్మకం లేదుగాని, నిజం చెప్పాలిసివస్తే, పరిస్థితులన్నీ గమనిస్తే, ఇంకా ప్రపంచంమార్క్సిస్టు సిద్ధాంతాలకే అనుగుణంగా వుందంటావా?

రైజోవు—ఏమిటి నీ అభిప్రాయం?

సెమ్యోనొవిచ్—ఫ్రాయిడ్; ఫ్రాయిడ్; ప్రపంచచరిత్రలో ప్రధానపాత్ర వర్గాలదికాదు. Sex!

రైజోవు—నువ్వూ, సిబ్బారువాళ్ళోరణలూ మంటగలిసిరి. మన కొత్త ఆడదానిని మోపేసుగనక, ఫ్రాయిడ్‌ముందుకొచ్చేవు.

తెర.

## మూడో రంగం.

ఫ్యాక్టరీలోని సమావేశమందిరం. అప్పుడే మీటింగు ఆపబడింది. పనివారు, ఆడవాళ్ళూ, మగవాళ్ళూ, పెద్దమేజాచుట్టూ మూగివుంటారు. మేజామీద ఎర్రగుడ్డపరచివుంది. జనం మధ్యన సోమోవు, చేతిలో గంట పట్టుకుని నిలబడివుంటాడు. సవూష్కిన్, బోల్టికోవ్, మీరాలుకూడా జనం మధ్యవున్నారు.

బోల్టికోవు—(ఉద్రేకంలో పెదవులదిరిపోతూండగా) ఊవు.. గ్రిగరీ డానిలిచ్! వద్దు. ఆడదాన్ని బ్రిగేడ్ లీడరు...వద్దు...అది చెయ్యకూడనిపని!

సోమోవు—నీ అభ్యంతరం ఏమిటోయి! ఏవిధంగా పనిచెయ్యవలసిందీ ఆమెకు తెలీదా? లేక ఆమె మనిషే కాదంటావా?

సవూష్కిన్—వినండి! వినండి!!

బోల్టికోవు—ఏవిధంగా చెప్పాలో నాకే తెలీటంలేదు...(మందకొడిగా) నాకెందుకు; నేనేం యజమానినికాను, ఫ్యాక్టరీమీదే. మీరే దానికి బాధ్యులు. నేను మేస్త్రీనిగనక నా అనుభవాన్నిబట్టి నాకు తోచింది చెప్పేను. ఎంత చెప్పినా ఆడది-ఆడదే. ఆవిడ వూహాలెప్పుడూ..పూర్వ కాలపుటూహాలే!...

సోమోవు—ఓరి అప్రాచ్యుడా! (మీరాతో) చూసేవా? (బోల్టికోవును చూపించి) ఇదిగో రాతిగోడ! చేతనైతే వొప్పించండి చూద్దాం!

మీరా—అట్టే కంగారు పడకుతాతా! ఇల్లాంటిరాతిగోడల్ని దాటి చెయ్యగలం. ఫరవాలేదు. ఈతని సంగతి మేం చెప్తాంకాదూ; ఈవేళ మాదిరిగా చులకనగా వదిలిపెట్టం. ఊంగిడెత్తిపోవాలి.

బోల్టికోవు—ఏమిటా మాట్లాడేది?

మీరా—నీ పెళ్ళాన్ని కొట్టడాన్ని గురించి.

సవూష్కిన్—బాగు, బాగు!



బోల్టికోవు—అయితే ఏమంటావు? నా పెళ్ళాన్ని నే కొట్టుకో గూడదా?...ఆడదాన్ని దానిమానానికి దాన్నివదిలేసేమంటే ఇంకేముందీ! మనం ఆడదానికంటేనూ కనాకష్టం అయిపోతాం.

సోమోవు—చూడతగిన మనిషి! పక్కారియాక్షనరీ!

మీరా—ఇల్లాంటివాళ్ళకి బుద్ధిచెప్పడానికి విచారణ ఏర్పాటు చేస్తాంగా.

బోల్టికోవు—విచారణ! ఎందుకమ్మా!

సోమోవు—పుప్పిపన్నులాంటివాడివి నువ్వు. నీమూలంగా ఫ్యాక్టరీ అంతా చెడిపోతుంది. ఆరోజులు వెళ్ళేయి!

బోల్టికోవు—పోండోయి!

[బోల్టికోవు వెనక్కి తిరుగుతాడు. సోమోవు ఎదటికి తిప్పుతాడు. ఒకరినొకరు ఏగాదిగా చూసుకుంటూ ఒక్కక్షణం నిలబడతారు.]

సోమోవు—ఏమంటావు?

బోల్టికోవు:—ఏమంటావేమిటి? ఫ్యాక్టరీఅంతా ఆడమళయాళం చేసేవు. పెద్దమనుష్యులకి నిలవనీడలేకుండాచేసేవు. నేను మానుక్కుపోతా. గౌనులేసుకునే ఫోర్మన్నుకూడా చూసుకో.

సవూష్కిన్—ఈలాగ ప్రవర్తిస్తే నిన్ను తరిమేస్తాం.

బోల్టికోవు—నేనెప్పుడూ ఈలాగే వుంటాను.

సవూష్కిన్—నిన్ను తరిమేస్తాం.

సోమోవు—సోగ్రాన్! నీధోరణి నేనెన్నటికీ ఒప్పుకోను. జాతులని అసహ్యించుకోడానికీ - స్త్రీలని అసహ్యించుకోడానికీ తేడా యేమిటి? నీలాంటివాడిని మాలోవుండనియ్యకూడదు వుండనియ్యం. ఇల్లాంటి దుర్వృత్తి కలక్కుండా తోమేస్తాం.

బోల్టికోవు—ఊఁ! చేసేను......

మీరా—కామ్రేడ్ బోల్టికోవ్! తెలివితక్కువగా ప్రవర్తించకు. జాగ్రత్త.

[రైజోవువస్తాడు. అసహ్యంతో చేయివిసిరి, పోతూ, ప్రవేశిస్తూన్న రైజోవుదగ్గిరకివస్తాడు. సోమోవు జనంమధ్య మరుగైపోతాడు.]

బోల్టికోవు—ఇగ్నట్! మనపనయిం దిక్కుడికి! ఈఫ్యాక్టరీలోకల్లా మనం యిద్దరమే కల్తీలేని కౌంటర్ రివల్యూషనరీలుగా కనబడుతూన్నాం. వాళ్ళకళ్ళకి! ఓహోహో! ఓరిదేవుడా! ఏంనాటకం ఆడిస్తూన్నావోయ్! (వెళతాడు.)

[రైజోవు భుజాలు కుదుపుకుంటాడు. మాటలాడడానిక్కూడా అతడు విసుపుగా వున్నాడు. జనం కదులుతారు. సోమోవు, ఇతరులూ కనబడుతారు.]

సఫ్రూష్కిన్—బాగు, డానిలిచ్! అయితే జీతా లేవిధంగా వుండాలి?

ప్రౌఢయైన స్త్రీ—శిశురక్షణాలయాలు కట్టిస్తారా?

కమ్యూనిస్టుపడుచు—డిపార్టుమెంటల్ బ్యూరో మాటేమిటి? కామ్రేడ్!

సోమోవు—(చెవులుమూసుకొని) జోరగలు! ... (చిరునవ్వునవ్వుతాడు.) మీమాటఒక్కటీ తెలియడంలేదు! (కమ్యూనిస్టుయువకులతో) రేపుప్రొద్దుటేవచ్చి నాతో మాటలాడలేరూ? నాతలపగిలిపోతూంది!... ఓరినాయనా!... (పనివాండ్రు సానుభూతిచూపుతూ నవ్వుతారు.) ముసిలాణ్ణి అయిపోయేను అరవైఏళ్ళొచ్చేయి!...పగలల్లా అటూఇటూ పరుగులెత్తడమేనాయె... మోటారుసైకిలునీదున్నా అంత హైరాణవుండదు. సాయంకాలానికి ఏదో బాధగావుంటుంది. (ప్రౌఢస్త్రీయొక్క రెండు భుజాలమీద చేతులువేసి) ఓపికున్నంతవరకు అన్నీచేద్దాం, తల్లీ! ప్రతివిషయం చర్చించుదాం; బాగా తెలిసేవరకూ ఎన్నిమాట్లేనా చెప్తా...

[పనివారు కబుర్లుచెప్పుకుంటూ, నోరుమెదపుతూ వెళ్ళిపోతూంటారు. రైజోవును చూడగానే సోమోవు అతనివద్దకు వస్తాడు పిలుచుకుని దూరంగా నడుస్తాడు.]

నీతో ఓమాట చెప్పాలి, ఇగ్నట్! ... నీవు ఈవేళ చేసినపనికి నీపార్టీటిక్కెటుకి గట్టిమందలింపు జతచేయవలసిందే. నీస్వభావం స్పష్టంగా చూపించేవు. బహిరంగసభలో ఆమాదిరిగా అల్లరా? అల్లా చెయ్యడంలో నీఅభిప్రాయం ఏమిటి?



రైజోవు—ఆవిషయం నాకూ విచారంగానేవుంది. కాని, నీఅభిప్రాయంకూడా నేను ఎందుకూ పనికిరాననేనా? ఇరవై ఆరేళ్ళనుంచి ఈఫ్యాక్టరీలో సతమతంకావడంలేదూ? నాలుగేళ్ళపాటు తుపాకి భుజానపెట్టుకుపోరాడలేదూ?...కొందరిమల్లేకాకుండా...

సోమోవు...నాకవన్నీ తెలుసును...నీగతం అంతా నేనెరుగుదును...అయితేమాత్రం?

రైజోవు—అబ్బే ఏమీలేదు. నేనే..కంట్రోలు కమీషనుదగ్గిరికి వెళ్ళి - వాళ్ళ సంగతంతా చెప్పేస్తా! నేనేం ఊరుకోను.

సోమోవు—వాళ్ళంటే!

రైజోవు—ఎవరా? ఆమేధావులు! ప్రతీఆడదీ నన్ను వెక్కిరించి తాటేకులు కట్టడమేనా?

సోమోవు—నీతో నేచెప్పబోయే దేమిటో ఎరుగుదువా? నీవ్యవహారం ఏమీ బాగుండలేదు. నాకలెక్టివులో ఈలాంటి వ్యవహారం సాగనివ్వను.

రైజోవు—ఓ! అదీ! నానోటికి తాళంవేస్తున్నావూ? తప్పుదార్లు తొక్కేననికూడా ఏడయినా ఆరంభిస్తావా?

సోమోవు—అది వేరే కొత్తగా చెప్పనక్కర్లేదు. ఇంగాని చూసి నేర్చుకో. గోలపెట్టబోకు. ఇంగా వర్కరు. ఒక్కొక్కప్పుడు నేనే ఆమెతో పోట్లాడుతూంటా...ఒక్కొక్కప్పు డోస్తుంది. నోరుపట్టనంత ముద్దమింగబోతుంది. అల్లాటప్పుడు నేను అడ్డగిస్తూంటా. కాని ఆమె ప్రజలలో కలిసిపోతుంది. విప్లవకారురాలు. ఈఫ్యాక్టరీని ఏలా తయారుచేసిందో చూడు. ప్రజలలో ఎంత చైతన్యం రేకెత్తించిందో చూడు. అసలు విషయంకూడా అదికాదు. పట్టుదల! స్పష్టమైనవూహా! జ్ఞానం! ఈమూడూ మనిషిలోవున్నాయి. అందుకై ఆమెని అభినందించి తీరాలి.

రైజోవు—ఔను. నిజమే...ఆమెలోనూ తప్పులున్నాయి. కాని, ఆమె పనిమాత్రం బహుచురుగ్గావుంటుంది...కాని నావ్యవహారం విషయంలో ఆచురుకుతనం బాగా ముదిరింది.

[తెర]

## నాలుగో రంగం.

ఫ్యాక్టరీ మేనేజరు ఆఫీసు. ఒక డ్రాయరు, దానిమీద ఎన్నో ఇతర సామానులతోపాటు చిన్న ఫ్లాల్‌దాన్, దానిమీద కొద్దిపాటిపూవులు, గోడల్ని కొత్తగా కట్టదలచుకొన్న బిల్డింగుల ప్లానులు, కొత్త పద్ధతిదుస్తులకి నమూనాల్లు, బ్లూప్రింట్లు - డయాగ్రాములు, వ్రేలాడుతూంటాయి.

ఇంగా ప్రవేశిస్తుంది. ఆమెవెనకాల నెమ్‌ట్సేవిచ్, మీరా, డిమిట్రీ, సవ్రూష్కిన్ మొదలయిన పనివారు చాలమంది ప్రవేశిస్తారు. సోమోవు - క్రైజోవులు తర్వాత వస్తారు.

కమ్యూనిస్టుపడుచు—కామ్రేడ్ రిజర్! నువ్వు మాకు సహాయం యిస్తావన్నమాటేనా?

ఇంగా—ఊఁ. ప్రారంభించండి. కమ్యూనిష్టుయువకదళాలసంగతి ముందుచూసి తర్వాత ఇతరవిషయాలు. మీరా! ఈవిషయం గోడపత్రికలో వెయ్యడం మరచేవుగనక. రేపటి ఆర్డర్లలో దీనినికూడా జతచేస్తా.

మీరా—గోడపత్రిక విషయం నామీద వదిలెయ్యి. [కమ్యూనిష్టుయువకదళం ఇంగాను చుట్టుకుంటారు. వారితో ఆమె సంభాషిస్తూ వుంటుంది.]

సవ్రూష్కిన్—కామ్రేడ్ రిజర్! వెలుతురులేక బాధగావుంది. వెలుతురేవుంటేనా. సంగతిచెప్పేవు!

ఇంగా—ఈవారంలో వెనకగోడకి కిటికీలు పెట్టించుకుందాం. కావలసినంత వెలుతురు.

ప్రౌఢస్త్రీ—శిశురక్షణశాలలమాట మరవకుసుమా?

ఇంగా—మూడోషిఫ్టు పనిలోకి వచ్చేటప్పటికి నర్సరీలు వస్తాయి. చూద్దుగానిక.

పడుచుపనికత్తె:—మరిషాగమాటెల్లాగ? మహాచెడ్డబాధగావుంది.

ఇంగా:—(వేగంగా, డిమిట్రీవంక తిరిగి) ఛైర్మన్! ఈవ్యవహారం మాటేమిటి?



డిమిట్రీ:—(అందరిదృష్టులూ తనవేపే వుండడంచేత కంగారుపడి) ఆవిషయం ఇదివరకే రిపోర్టుచేసేను...జ్ఞాపకంలేదూ? ...కూలీరక్షణశాఖ?

(జనంలోంచి ఎవ్వరో గెంటుకుంటూరు. అంతా గలిభీ పడతారు.)

ఇంగా:—ఓ! ఔను! రోమన్‌ఫ్రాంట్సేవిచ్! నీతో చెప్పిన పని అతివేగంగా జరగాలి.

నెమ్‌ట్సేవిచ్—అలాగే!

(నెమ్‌ట్సేవిచ్ తన నోటుబుక్కులో ఏదో వ్రాసుకుంటాడు. పనివారు గుంపులుగుంపులుగా వెళ్లిపోతారు. సోమోవు - ఇంగాలుమాటలాడుకుంటూంటారు. మొదట వారిమాటలు వినబడవు. ఇంతలో సోమోవు అరుస్తాడు.)

సోమోవు—తప్పదు! తప్పదు! కొత్తపద్ధతులమాట తర్వాత చూద్దాం. ఇది చాలా ముఖ్యం. (గోడమీదనున్న నమూనాలవేపు తల ఎగరవేస్తాడు.)

ఇంగా—మళ్లీ పద్ధతులేమిటి? తాతా! బాగా మందకొడిగావున్నట్టుందే వ్యవహారం. రాజకీయవిషయాలు, ఆర్థికవిషయాలలోనూ మా అందరికీ పాఠాలు చెప్పగలవు. కాని, నీకు అందం చందం ఏమీ తెలీదు.

సోమోవు— అందచందాలు అంత ముఖ్యమా?

ఇంగా—అలాగెవరన్నారు? పనిలో కొత్త పద్ధతులన్నిటికన్నా ముఖ్యం. షాక్‌బ్రిగేడ్లు - సోషలిస్టుపోటీ - ఫ్యాక్టరీ అభివృద్ధికి అందరూ శ్రమకోవడం—

సోమోవు—మరింకేం?

ఇంగా—అన్నింటికంటేనూ ముఖ్యం నూతన భవననిర్మాణం. ఏడు నెలలనాటికి మనం అందులోకి చేరాలి...మంచి వెలుతురుతో - ఆరోగ్యకరంగా—అధునాతన యంత్రసామగ్రితో ... (యంత్రపునమూనాలవంక చూపుతుంది.)

సోమోవు—ఔను!

ఇంగా—అంతకంటేనూ ముఖ్యం - ఎక్కువ సరుకు తయారుచెయ్యగలగాలి... చవకగా తయారుకావాలి ... సరుకు సర్వోత్తమంగా వుండాలి...

సోమోవు—సరిగ్గా అంతే! అదే నేచెప్పే...

ఇంగా—సర్వోత్తమం అంటే ఒక్క బలంగానే కాదు. అందంగా కూడావుండాలి. ఆఅందంకూడా కొత్త పద్ధతిలోవుండాలి. ఉత్పత్తి విధానం ఒక్కటేనా మనం పునర్నిర్మించవలసింది. వస్తువుల్ని కూడా నూతనపద్ధతిలో తయారుచెయ్యాలి. ఉత్పత్తిలో కళని ప్రవేశపెట్టాలి. ఇదీ ఇప్పుడు మనం చూడవలసింది. మన జనం బాగా ముందుకువస్తూన్నారు. ఆపని మనం చెయ్యగలం...

మీరా—(కొంచెం వేళాకోళంగా) సౌందర్యసాధనకా పంచవర్ష ప్రణాళిక!

ఇంగా—ఎందుకు కూడదు?

డిమిట్రీ—ఇంగా! నువ్వుచెప్పిందే సరి! ఏదీ-(చేయి అందిస్తాడు. కాని, ఆమె గమనించేపాటి తీరుబడిగావుండదు.)

ఇంగా—రాజకీయాలలోనూ, ఆర్థికవిషయాలలోనూ మనం నూతనవిధానాలకోసం వెతుకుతూన్నాం. కాని, నిత్యజీవితంలో యూరపువాళ్ళనే అనుసరిస్తూన్నాం. వాళ్ళకంటె మనజీవితవిధానం ఉత్తమంగా ఉండాలని చెప్పడానికి అంతచెదు రెందుకు?—అంతకంటె అందంగా జీవించాలి. మనం ఒక కళాభిజ్ఞుడిని సంప్రతించేటప్పుడు యూరపియను పద్ధతులకే ఎందుకు ప్రయత్నించాలి? అదే ఖరీదుకి అంతకంటె అందమైన సోవియటునమూనాలు దొరుకుతున్నాయిగా, దానివలన మనకివచ్చే నష్టం ఏమిటి?

రైజోవు—(వెక్కిరింతగా) అనవసరం, యూరపులోవాళ్ళంతా వటి పసివలు. తెగ ఆలోచించేరు. కాని, స్వరూపంమాత్రం తేల్చలేకపోయేరు.



మీరా—ఓహో! యూరోపువాసివా! యూరోపు సంగతులన్నీ అట్టేపెట్టు నాయనా?

రైజోవు—నేను యూరోపుకేకాకుండా ఇక్కడికీకాకుండా అయేను. ఇదిగో చెప్తూన్నా వినండి: పంట్లాములూ, కోట్లూ, కాలర్లు మీకూవున్నాయి. మీరూ తొడుక్కోండి. అనవసరవిషయాలకి దిగక మీ యంత్రాలూ—మీ గొడవేదో చూసుకోండి!

ఇంగా—నువ్వేంచేస్తావు, మరి!

సెమ్యోనివిచ్—మాటవచ్చింది గనక అడుగుతూన్నా! ఇంగా! ఇగ్నట్ తీసుకువచ్చిన మిషన్ల సంగతేమిటి?

ఇంగా—మనం ఏంచేస్తాం? ఆతని కాతాలోవ్రాయి.

సెమ్యోనివిచ్—అలాగే!

రైజోవు—నా కాతా అంటే నీ అభిప్రాయం ఏమిటి?

ఇంగా—స్పష్టమే. త్రాగుడికి ఎంతోకర్చుపెట్టలేవు. దుర్వ్యయమూ చెయ్యలేవు. పంచవర్షప్రణాళిక ఆఖరుకి నువ్వుపాడుచేసినడబ్బు చెల్లించి వెయ్యగలవు.

రైజోవు—కామ్రేడ్ రిజ్యార్! నీకోమాట చెప్తూన్నావిను. నీ చేతనంత తాటేకులు కట్టించుకుందుకంత వెర్రిపీనుగు లెవ్వరూలేరు. నీకు నువ్వే కట్టుకోవాలి.

ఇంగా: -వ్యవహారం విషయంలో నేను వేళాకోళాలు చేస్తాననుకోకు రేపటి ఆర్డర్లో నువ్వే చూద్దువుగాని, కాదూ?

రైజోవు—అలాగే చెయ్యదలచుకున్నావన్నమాట.

ఇంగా—లేదు. నీతో వేళాకోళం ఆడుతున్నా. (ఖచ్చితంగా) నీఇష్టంవచ్చినట్లల్లా డబ్బుతగలేస్తే గవర్నమెంటు ఆనష్టం అంతా భరించి వూరుకుంటుందనేవూహిస్తూన్నావా?

రైజోవు—నీ ఎత్తు ఇదన్నమాట! అదీసంగతి! నన్ను అవమానించదలచుకున్నావు. నన్ను నాశనం చెయ్యదలచుకున్నావు! అంతేనా నీ అభిప్రాయం? ఏమయ్యా! గ్రిగరీ! నువ్వు [illegible] సాయకుడివి. [illegible] పలుకుతావా నువ్వుకూడా.

సోమోవు—ఆమెది సరయిన మార్గమేనంటా.

రైజోవు—ఆమెది? ఫ్యాక్టరీకట్టడానికి పంపిస్తే—ఈవిడ......

ఇంగా—ఈవిడేమిటి?

రైజోవు—ఈవిడకనపడ్డచోటనల్లా పువ్వులతో అలంకరిస్తాండే ఈవిడమాట సరియా?

సోమోవు—ఎంత అందంగా మాట్లాడేవు?

మీరా—ఇతడి మనస్సులోని మాటపైకి చెప్పడానికి భయపడ్డాడు

రైజోవు—భయపడ్డానూ? అయితే మాత్రి మప్పిడి ఎందుకు బహిరంగంగానే చెప్తా. చీకటిమాటున పడుచువాళ్ళతో నిల్చుని బాత ఖాని వెయ్యడం, సరసాలాడడం, అవీ నే చెప్పవలచుకున్నది.

(డిమిత్రీ ఆతని వైపురుకుతాడు. ఇంగా స్తంభించిపోతుంది.)

నేను నాకళ్ళతో చూసేను. సరా?

ఇంగా—ఎవరితోటి?...ఎక్కడ?...నువ్వు ఏలాగ చూసేవు?

డిమిత్రీ—డావివిచ్! నేను......

సోమోవు—నువ్వనకు. దీంట్లో నీకేం సంబంధం?

డిమిత్రీ—సంబంధం అంటావేమిటి? వాడిష్టంవచ్చినట్లల్లా కుయ్యి? నేను......

ఇంగా—డిమిత్రీ! ఆమాటలో నీకేమీ సంబంధం లేదు. రెవ్వరూ నాకు రక్షణ ఇవ్వవనిలేదు. నాసంగతి నే చూసుకోగలను.

రైజోవు—(డిమిత్రీవంక వెక్కిరింతగా చూసి) అదిగో దొం తనంతే దొరికిపోయెడు.

డిమిత్రీ—కామ్రేడ్! నువ్వు ఏమంటూన్నావో తెలిసి మాట్లాడు.

రైజోవు—నే తెలుసుకోవలసిన విషయాలు నువ్వు బోధించనక్కరలేద

(కలబడుతారు.)

సోమోవు—ఆగండి! (గంట చేతపట్టుకొని వారివంకపరుగెత్తుతా పోట్లాడుకోడానికి ఇదా చోటు మీకు దొరుకుత. ఇక్కడ కలబడడా



వీలులేదు. (వారిద్దరిమధ్య నిలబడతాడు.) దూరంగాపొండి. ఈవ్యవహారం రేపు నేవిచారణచేస్తా. అంతే!

ఇంగా—ఈవిషయం ఇంతతో వదలడానికి వప్పుకోను. (రైజోవు వద్దకు వస్తుంది.) ఇగ్నట్! నీవన్నమాటమీద నిలబడతావా? నువ్వు చెప్పిన దానికి ఎప్పుడెప్పు డెల్లాగ జరిగిందో నిరూపించవలసిన పూచీ నీమీద వుంది. లేదా ఆమాటకి శిక్షాపాత్రుడివి ఔతావు. వింటున్నావా? కంట్రోల్ కమీషన్ ముందు నువ్వు ఫిర్యాదు చేసి తీరాలి. అప్పుడే ఇందులో నిజం బయట పడుతుంది. అక్కడే దీనినిగురించి చర్చచేద్దాంలే.

రైజోవు—ఆహా తప్పకుండా! మహాచిత్రమైనమనిషి వేనే! నీతోటి శ్రామికుల సహజపద్ధతిలో మాట్లాడిన సాధారణమైనమాటకి...

ఇంగా—ఇన్నిమాటలతో పనిలేదు. ఒక్కటేప్రశ్న...కంట్రోల్ కమీషన్ ముందు ఫిర్యాదు పెడతావా? పెట్టవా?

రైజోవు—ఊ! పీకుక్కతినకు!

ఇంగా—ఇగ్నట్! తప్పించుకుపోడానికి ప్రయత్నించకు. సమాధానంచెప్పు.

రైజోవు—నేనెందుకు ఫిర్యాదు చెయ్యాలి. కంట్రోలు కమీషన్ ముందు?...

ఇంగా—ఆధైర్యంలేదు! భయపడుతూన్నావు! అంటే అబద్ధంచెప్తున్నట్లేనా?

రైజోవు—నన్ను వదలండి!

డిమిత్రీ—ఆమాటేదో చెప్పు!

సోమోవు—ఇగ్నట్! అది మంచిపద్ధతి కాదబ్బాయి?

రైజోవు—పోనీండి. ఒకవేళ నేనే పొరపడ్డానేమో ... నువ్వు కాకపోవచ్చు...నన్నొదలండి... ఓరిదేవుడా! వదలమంటే వదలరేం? ప్రాణాలు తోడేస్తున్నారురాబాబూ!

(ద్వారంవేపు నడుస్తాడు.)

మీరా—ఓరి నీ...పట్టి 'శోమటి'!

సోమోవు—ఇగ్నట్! ఎక్కడికి పోతూన్నావు? గొడవ ఒకటి తెచ్చిపెట్టి, నువ్వు పారిపోతావేం? ఆగు. నీకే చెప్తూంట! (అతని వెనకనే పరుగుత్తుతాడు.)

మీరా—పరిస్థితులు విషమిస్తూన్నాయి. ఇంటికి పోదాంరాండి... ఇంతవరకు చేసిందిచాలు. ఇంకా తెల్లవార్లూ 'గోడపేపరు' కోసం తల పగలగొట్టుకోవాలికూడాను. ఓ! (ఒళ్ళు విరుచుకుంటుంది.) ఇంగా! ఇంటికి పోదామా?

(ఆమెకి సమాధానం ఇవ్వకుండానే ఇంగా ఒకవేపు నడుస్తుంది. తలవని తలంపుగా వచ్చిన ఈఘటనకి ఆమెలో కలిగిన బాధ అణచుకో లేకుండావుంది. మీరా ఆమెవెంట నడుస్తుంది.)

పోదాం, రా. ఏమిటది? ఏమిటాలోచిస్తూన్నావు?

ఇంగా—మగాళ్ళనిగురించికూడా ఈలాగే ప్రవర్తించలేరెందుచేత? వాళ్ళు ఏపనైనా చేయవచ్చునా? కాని, మనం...మనంచేసేపనులు గోరంతలు కొండంతలుచేస్తారూ? (తలవూపుతుంది.) వాళ్ళమొహంలే. నడు పోదాం.

సెమ్ట్సోవిచ్—ఇంగా! ఒక్కనిముషం!... ఈకాగితాలమీద సంతకం పెట్టాలి...రేపుప్రొద్దుట...

డిమిట్రీ—నీపని ఎంతట్లో అవుతుంది?

ఇంగా—(డిమిట్రీతో) ఓముఖ్యమైన విషయాన్నిగురించి నీతో మాట్లాడాలి, వెళ్ళిపోకు.

మీరా—సరే మాట్లాడుకోండి. నేపోతాను.

డిమిట్రీ—(ఇంగాతో) తరవాత కనబడతానులే.

(మీరాతో వెళ్లిపోతాడు.)

సెమ్ట్సోవిచ్—బాగుంది, బాగుంది...ఇగ్నట్! నీస్వభావం ఈ మాదిరిదని ఎన్నడూ తలపలేదు.

ఇంగా—నాతో నీకేమైనా వేరే పనివుందా?



సెమ్ట్సోవిచ్—ఇంగా! నాకు చాలా ఆశ్చర్యంవేసింది. చెప్పొద్దూ! నిన్ను దబాయించడం ఎవ్వడితరంకాదు. వాడిని ఎగేసి తొంగవరికేవు!

ఇంగా—రోమన్ ఫ్రాంట్సేవిచ్!...నాతల బద్దలయ్యేటంత పోటుగావున్నది...ఏంకావాలినీకు!

సెమ్ట్సోవిచ్—(ఆటగా) నీకోమాట చెప్పాలనుంది. చిన్నమాటే. కాని చెప్పడం ఏలాగో తెలియడంలేదు. (ఎగాదిగాచూసి, మంచి అందమైన, విచ్చినపూలతో ఘుమఘుమలాడిపోతూన్న పూలతోటలావున్నావు!

ఇంగా—కామ్రేడ్ సెమ్ట్సోవిచ్! ఇంజనీర్లు కవులుగా మారేరంటే హాస్యంగావుంటుంది...నువ్వేరగంది ఏముంది?

సెమ్ట్సోవిచ్—(సిగ్గుపడి) అంతేనా?

ఇంగా—మనస్ఫూర్తిగా నీతో చెప్తున్నా విను. వ్యవహారం ఎంతవరకో అంతవరకే మనపరిచయం. అదే ఉభయులకీ క్షేమం.

సెమ్ట్సోవిచ్—అద్భుతం! ఇంత గంద్రగోళం జరిగినా నువ్వు మామూలుగానే వున్నావు. ఆశ్చర్యం!

ఇంగా—కామ్రేడ్ సెమ్ట్సోవిచ్! నీకు పదిమాట్లు చెప్పనక్కర్లేదు. మాట్లాడవలసింది మరొకటి లేకపోతే నే వెడతా. (వెనుతిరుగుతుంది.)

సెమ్ట్సోవిచ్—క్షమించు, అయిపోయింది. ఇదిగో.

[కాగితాలు తెస్తాడు. బల్లమీదపెట్టి, ఫౌంటెన్ పెన్ చేతికిస్తాడు. ఇంగా బల్లమీద వొంగి కాగితాలు చూసి సంతకాలు పెడుతూంటుంది.]

ఇంగా—దీనిమీద సంతకం చెయ్యను.

సెమ్ట్సోవిచ్—ఏమిటది? ఎందుచేత?

ఇంగా—ఫ్యాక్టరీకమిటీ ఛైర్మన్ దీనిని ఎప్రూవు చెయ్యలేదు.

సెమ్ట్సోవిచ్—ఫ్యాక్టరీకమిటీ ఛైర్మన్ ఒకడు తరవాయా దయవుంచు. ఇందులో ఏమీలేదు.

ఇంగా—నువ్వుపనిచేస్తూన్నది సోవియటు ఫ్యాక్టరీలోననే సంగతి మరువకు.

సెమ్ట్సోవిచ్—మరువలేదు.

ఇంగా—శ్రామికులయొక్క వ్యవహారాలు నిర్ణయించబడేటప్పుడు యూనియన్ సమ్మతి తీసుకోవడం అవసరం.

సెమ్‌ట్సేవిచ్—కాని ఇల్లాచూడు! ఇది బాధకరమైన విషయం కాదు. మనకాళ్లూ చేతులూ కట్టివేయబడి పోయినట్లే!

సెమ్‌ట్సేవిచ్—"బాధకరం కాదనుకునేవారు ఇక్కడ పని చెయ్యడం అనవసరం!

సెమ్‌ట్సేవిచ్—(తలవొంచి, చిన్నపుచ్చుకుని) థాంక్యూ!

(తెర)

## అయిదో రంగం.

సహకారవసతిగృహంలోని మెట్లగది. ఎదురుగా రెండుద్వారాలు. ఒకదానిమీద 'సెమ్‌ట్సేవిచ్' అనే పేరుగల ప్లేటు అతికించివుంది. రెండోదానిమీద ఏమీవుండదు. అదే ఇంగాగది. ఇంగాద్వారంవద్ద సెమ్‌ట్సేవిచ్—ఇంగాలు వీధిలోకిపోయివచ్చిన దుస్తులతో నిలబడివుంటారు. ఇంగా తాళంచెవి తిప్పి లోనికి వెళ్ళడానికి సిద్ధంగావుటుంది.

సెమ్‌ట్సేవిచ్—(టోపీఎత్తి) గుడ్‌నైట్! ఇంగా మార్టినోవా! నన్ను తప్పు అర్థం చేసుకున్నారని మళ్ళీ చెప్తూన్నా!

ఇంగా—రోమన్ ఫ్రాంట్సేవిచ్! సరేకా. ఇంక దానిని గురించి పెద్దచర్చ చెయ్యదలచుకోలేదు. మళ్ళీ రేపు...

ఆమె గదిలోనికి ప్రవేశించ సిద్ధంగావుంటుంది. ఆసమయంలోనే సెమ్‌ట్సేవిచ్ గదితలుపు తెరుచుకొని వెరోనికా తొంగిచూస్తుంది. స్వచ్ఛమైన "కిమోనో" తొడుక్కుంది. జుట్టు అతిజాగ్రత్తగా అలంకరించుకుంది.

వెరోనికా—రోమూల్కా! ఆలస్యం అయిందేం? నువ్వు రాకపోవడంచేత పేకాట ఆరంభించలేకపోయేం. ఓ! ఇంగామార్టినోవా! ఏలావున్నావు? ఈవేళ రాత్రి ఏలాగున్నావనుకున్నావు? దివ్యంగా వున్నావు!



అద్భుతంగా! కాని, ఇగ్నట్ ఇవానోవిచ్‌ని అంతభయంకరంగా ఏడిపించేవేమిటి? నిజంగా చంపేస్తున్నావు వాడిని.

సెమ్‌ట్సేవిచ్—మరేంఫరవాలేదు. మరోమాటు త్రాగి లేచొస్తాడు అంతగా అయితే.

వెరోనికా—(ఇంగాతో) నేనే మగవాడినైవుంటే నీశక్తికి అసూయపడివుండేదానిని. మన ఆడవాళ్ళకి జరిగిన అపకారానికి ప్రతి తీర్చుకున్నావు. మంచిపనిచేసేవు. వాళ్ళని ఎంతమాత్రం దయతలచకూడదు. ఎంత దిట్టమైనదానివి? ఆహా ఆ తెలివితేటలు, ఆసామర్థ్యం! కాని, అన్నిటికంటెనూ విశేషం కార్యదీక్ష! అటువంటి శక్తి నాకేవుంటేనా! (మగనితో) అసలిప్పుడు మనుష్యులంటూవున్నారూ? ఆసౌందర్యం వుందిగనకనా?... ఎబ్బే? ఏమీలేదు...వట్టిది! వట్టి మెటీరియలిజం!

సెమ్‌ట్సేవిచ్—డియర్!...జలుబు చేస్తుందేమో జాగ్రత్తసుమా!

వెరోనికా—(అతనివేపు వెన్నుతిప్పి) నేనుకూడా పనిచేస్తానంటే వినిపించుకోవు. నేనూ ఛైర్మన్ కావాలనుంది...ప్రజలలో తలెత్తుకుతిరగాలనుకుంటాను...నాకు మహాచెడ్డతామసం ఎత్తుకొస్తూంది. నేనేదైనా పని చెయ్యడానికి పనిచూపించి మీరందరూ అనేటట్లుగా ఆభారం ఏదో కొంత నాకూ ఎత్తండి! కానీ, ఇల్లాంటిమొగుణ్ణి - ఈకాపురాన్నీ పెట్టుకొని ఎక్కడి కెళ్ళడం? సరే కాని,...చాలా తెలివైనవాడివికాని, నిజం చెప్పు! సరియైన సమాజం, సరియైన సౌందర్యం ఈవేళ నున్నాయనే అంటావా? ఫ్రెంచివిప్లవం ఏమిటో నాకు అర్థంఅయింది. దానివలన వారు సమస్తమూ, ఉత్సవాలూ, ఊరేగింపులూ, ఒక్కటేమిటి? ... కాని, ఈవేళ...ఫేక్టరీలు ఒక్కటే ఫ్యాక్టరీలు! కేవలం దబ్బుది అధికారం!... హా! హా! హా! నిర్మాణసమావేశాలు!...పారి - ఓరిదేవుడా! ఆమాట నోట తిరగనే తిరగదు...ఏమిటది? పారి - శ్రామికతత్వం! ఏమనిషికేనా ఆవేశం - ఉత్సాహం కలగాలంటే మాత్రం ఏలాగ కలుగుతుంది?

ఇంగా—(ఇంక భరించలేక) క్షమించండి! చాలా అలిసిపోయివున్నా!

(తనగదిలో అడుగుపెట్టబోతుంది. నెమ్ట్సేవిచ్ తన గది ప్రవేశించబోతాడు.)

నెమ్ట్సేవిచ్—ముద్దుం! లోపలికొస్తావా? మెట్లమీదనే ఉంటావా!

వెరోనికా—నువ్వు నాకేం చెప్పనక్కర్లేదులే. .సరేలే.. నేనూ వస్తూన్నా. గుడ్‌నైట్, ఇంగామార్చినోవా!

(ఇంగా తనగదిలోకి వెళుతుంది. వెరోనికా నెమ్ట్సేవిచ్ వేపు తిరుగుతుంది.)

ఏమిటిసంగతి? నా అభిప్రాయం చక్కగా చెప్పలేదంటావా? నాకు తెలివితేటలు తక్కువని ఆలోచిస్తూన్నావా?

నెమ్ట్సేవిచ్...అదికాదు. నేనాలోచించేది.

వెరోనికా—ఏమిటిమరి?

నెమ్ట్సేవిచ్—నేనోసూదినీ - నువ్వో దారంవీ అనుకుంటున్నా.

వెరోనికా—ఏమిటవి? దారం ఏమిటి?

నెమ్ట్సేవిచ్—అక్కడ క్లబ్బులో - మీటింగులో - మళ్లీ ఇక్కడ ఈ మెట్లమీద - ప్రాణాలు కొరికేస్తున్నావేమిటి?

వెరోనికా—నువ్వు వట్టి స్వార్థపరుడివి. నీకు వంటమనిషిలా - దాసీలావుండాలంటావు. నేనూ సోషల్‌వర్కర్‌ని కావాలన్నప్పుడల్లా నన్ను అవమానిస్తూనేవున్నావు...దారం! హు! జాగ్రత్త! ఇంకెప్పుడూ అలాగనకుండా నోరు నొక్కేస్తా.

నెమ్ట్సేవిచ్—ఓ మహాసంతోషం! నువ్వు దారంవేంకర్మ. నా పీక్కి ఓ పెద్ద వురిత్రాడువి. సరా!

(లోనికి పోతాడు.)

[తెర]



## ఆరో రంగం

ఇంగాగది. సుందరంగా అలంకరించబడింది. ఒకఇనపమంచం. ఒక చిన్నచొరుగులపెట్టె. వ్రాసుకుందుకుమేజా, అంతే అలంకార ద్రవ్యాలుంచుకునే బల్లమాత్రంలేదు. మూడుకొయ్యకుర్చీలు, ఒకపియానో, పుస్తకాలబీరువాలు అచ్చటగల సౌందర్య సామగ్రిఅల్లా, కొద్దిపాటి అందమైన చెక్కడపుపనులు, శిల్పముల ఫొటోగ్రాఫులు; మంచిచిత్రకారుల చిత్రపటాల ప్రతులుమాత్రమే. సాధారణమైన నల్లనివస్త్రంలో బిగించిన 'బిథోవెన్' ఫొటో పియానోమీదవుంది. దానిమీదనే షాల్‌దానూ, సంగీతపు పుస్తకం, మరి రెండు పుస్తకాలూవున్నాయి.

ఇంగా పియానోవద్ద నిశ్చలంగా, నీరసంగా, ఏదో ఆలోచిస్తూ కూర్చుండివుంటుంది. మీరాగదిలోకి తొంగిచూస్తుంది.

మీరా—ఇంగా! ఒక్కర్తివీవున్నావేం! (ఇంగా ముఖంవంక తేరిపారిచూసి) ఏం అల్లావున్నావు?

ఇంగా—ఏలావున్నాను?...ఏలాగోవుంది. మీద ఉమ్మివేస్తే... కుళ్ళునీళ్ళుమీద పోస్తే - బంటి వొంటికిపూస్తే ఎంత అసహ్యంగా వుంటుందో అలావుంది నామనస్సుకి....వెనకటి ఒక్క - చిన్నఅబద్ధంతో నాశక్తి, నాచురుకుదనం, నావ్యక్తిత్వం సర్వం నశించిపోయినాయిగదా అని బాధగావుంది. ఇదంతకీ కారణం ఏమిటీ?—నేను ఆడదానినిగా పుట్టడమే!

మీరా—ఊ! అదేశాపాడించకు. అదేం కొత్త కాదు. అసలు ఆడది కావడమే బాధ. ఊరూపేరూలేని శైకోవు ఏదో వెధవమాట అన్నాడని బాధపడడమేనా?...కాని, నిజంచెప్పాలంటే - నువ్వు అతడితో సరసాలాడుతున్నావు.

ఇంగా—సరసం? ఎవ్వరితో?

మీరా—నేనేం భావగర్భితంగా మాటలాడడంలేదు...డిమిత్రీతో.

ఇంగా—అందరిముందరా ఆతనితో వేళాకోళాలాడగలననే నువ్వూ తలుస్తూన్నావా?

మీరా — లేదులే... కాని, మాటవరసకి...

ఇంగా — మాటవరసేమిటి?... నే నాతడిని నా ప్రాణాలతో సమానంగా ప్రేమిస్తూన్నా. తెలుసునా?... అదీగాక... ఎందుకు ప్రేమించకూడదు? నేనేం సన్యాసం పుచ్చుకున్నానా? నేనేం కాన్వెంటులోని కన్యనా? నేను ఏల ప్రేమించకూడదు? కమ్యూనిస్టు పడుచులు ప్రేమకి లోబడవచ్చునా? స్త్రీ పనివాళ్ళకి అభ్యంతరం లేదూ? కాని, మేనేజరే! అమ్మబాబో. ఎంత అనుచితం? అవును కాని, ఇండస్ట్రియలైజేషనుకీ ప్రేమకీ కుదరదు కాబోలు నేం?... ఏం? నేనాతడిని ప్రేమిస్తూన్నా. నేను మంచి పడుచుదనంలో వున్నాను. కనక నే ప్రేమిస్తూన్నా. ...ప్రతివస్తువులోనూ నా కా ప్రేమే ప్రతిఫలిస్తూ కనబడుతూంది. వెనకటిమాదిరిగా కాదు. ఇప్పుడు ధ్వనులలో తేడా, రంగులలో భేదం తెలుసుకోగలుగుతూన్నా... కొత్త వర్షాలలోని పరిమళం గ్రహిస్తూన్నా... కొత్త వర్షంలో పరిమళం వుంటుందని నీ వెరుగుదువా? భూమిలో - ఆకులలో - గాలిలో కేవలం పరిమళమే తెలియవస్తూంది... మొగ్గలు విచ్చుతూన్న ధ్వని గుర్తించగలవూ? నేను...

మీరా — మొగ్గలా?... నువ్వేమిటంటున్నావో కూడా నాకు తెలీటంలేదు. ఓ... చెట్ల మొగ్గలా? నా వయస్సులో నేనూ ఆ ధ్వనులు వినగలిగేను!

ఇంగా — ఈ ప్రపంచం అంతా నాకొక మత్తువస్తువుగా వుంది. భూతద్దంలోంచి చూసినట్లుగా కనబడుతూంది. దాని సౌందర్యం నాకు తెలీకపోయినా, నేనుకూడా అందంగా వుండాలని వాంఛకలుగుతూంది. నేను... నాకోరిక ఎంతసాధరణంగా... అమాయికంగావుంది. సాధారణమైన కోరిక కనకనే అమాయికంగా వుందిలే. కాని, నామటుకి నేను బాగా పెరిగిపోతున్నానని అనుకుంటూన్నా. నాలోని శక్తి అంతకంతకి దృఢపడుతూంది. ఇన్నేళ్ళపాటూ నేనూ ఒక సైనికుని మాదిరిగా వుండిపోయేను. నాకు స్వాంతం అనేదిలేదు. అంతా పార్టీదే. చెప్పేది అర్థం అవుతూందీ?... పెట్టెలో పెట్టి వాళ్ళకి తోచిన చోటికీ పంపేసినట్లే జరిగింది. కాని ఇప్పుడంతా మారింది...



కొత్త దారి కనబడింది... ఇంతకాలమూ అణిగివున్న వాంఛలు తలలెత్తేయి. నామట్టుకి నేనే మారిపోయినా. ఎంతో పూటుకున్నా నవ్వుతేనవ్వేవు... గాని, పదహారేళ్ళపిల్లగానే వుండిపోయానని నావూహ!... నేనాతడిని ప్రేమించేను. ఆతడివలన సుఖపడగలుగుతూన్నా. నన్నొకళ్లు వెక్కిరించడానికి అధికారం ఏంవుంది? ప్రేమించగల అధికారం నాకు లేకుండా లాగివేసేరా?

మీరా — అసలు విషయం అదికాదు. నీచిత్తం వచ్చినట్లు ప్రేమించు... కాని, చూసేవూ, నీపనులన్నీ చిత్రంగావుంటాయి. (గభీరంగా చుట్టూ చూస్తుంది.) ఈచెక్కడములు, 'ఈ బెగ్గో వెర్గా' ఫొటోలేగాని, మార్క్సు ఫొటో కనడదేం? ఏమిటోరంగులంటావు! పరిమళం అంటావు. అవన్నీ ఆపరమేశ్వరుడికే తెలియాలి. ఆపరిమళాలు. ఆరంగులూ, నాకేమీ తెలియకపోయినా నేను పెళ్ళాడేసు... ఒక్కమాటు కాదు, ఏడుమార్లు! — తెలిసిందీ? అందరిలాగే నువ్వూవుండు... ఈశ్వంగా రాలూ. ఈపిచ్చిగోరణులూ కట్టిపెట్టి... నామట్టుకి నువ్వు వట్టి భావకవిత్వపు బురదలో కూరుకున్నట్లు తోస్తూందిసుమా!

ఇంగా — బురదంటావేమిటి?... తన మనసు విప్పిచెప్పడం... తాను చెయ్యగలదానికి రెట్టింపుపనికి సిద్ధంకావడం... నూతన నిర్మాణాలకి - పోరాటాలకి పరుగెత్తడం... ఇదంతా బురదా? ఒకమనిషిని నమ్మడం... ఒకనితో స్నేహంచెయ్యడం... నన్ను పూర్తిగా అర్థంచేసుకున్న వానితో నేస్తం చేయడం. బురదలో దిగడమేనంటావా?... ఆతనితో కూడా చేయీ - చేయీ కలిపి పనిచెయ్యడంకూడా... తప్పేనంటావా?

మీరా — కాని, నువ్వందులో చిక్కుపడిపోతే!... ఒకవేళ దాని వలన బాధపడవలసివస్తుందనుకో... ఇవన్నీ నీ వెరగవూ? నామనస్సులో మాట పైకి చెప్పేదెలాగో తెలీయడంలేదు... మనలో ఇంకా పూర్వపు వాసనలు మిగిలివున్నాయి. అవన్నీపోవాలి. వాటిని పెరగనియ్యకుండా తగులబెట్టాలి. నే చెప్పేది అర్థం అవుతూందీ?... మనకి పిల్లలేవుంటే—

వాళ్ళు ఈవిషయంలో కొత్తపంథాలే తొక్కుతుండేవాళ్ళు. నువ్వూ-నేనూ వున్నామా ఇంచుమించు మన అవస్థ త్రిశంకుడివత్తుగావుంది. పూర్వపు వాళ్ళతో వాళ్ళ ఆచారాలలో పుట్టి పెరిగేం - పెద్దవాళ్ళం అయ్యేం. కాని కమ్యూనిస్టుయువదళం వుందంటే వాళ్ళమార్గాలేవేరు...నిజం చెప్పాలంటే వాళ్ళమాదిరిగా జీవించాలనే నా కోరిక—!

ఇంగా—నాకేమీ తెలియదు...నేను చిన్నప్పుడే విప్లవరంగంలో దిగేను...నాతండ్రే నన్ను దింపేడు! ఆయనో బోల్షివిక్కు. ఆయనే నాకు ప్రపంచం చూపేడు. జ్ఞానం కలగచేసేడు. చాలా దురదృష్టకరమైన ఘట్టం. ఈవేళ నేను నూతనవాతావరణంలోకి మారడానికి అదే పెద్ద అభ్యంతరంగావుంది. కాని, ఏంచేస్తాను? విప్లవం తప్ప మరోసంగతే తెలియదాయె నాకు. దానికే పూర్తిగా అర్పితం అయిపోయేను. మరొకళ్లు ఇంతకంటె ఎక్కువగా అర్పించగలుగుదురేమో కాని, నాతరంకాదు... నా శక్తియున్నంతవరకు సమర్పించేను—చాలలేదు మరి—

(ఇంగాకి మాట పెగలిరాదు. నిశ్శబ్దం! మీరాకొంచెం కంగారుపడి మాటలాడుతుంది.)

మీరా—అయితే మీకున్న అభ్యంతరంఏమిటి?

ఇంగా—అతనికి భార్యవుంది...బహుశా నీకూ తెలిసేవుంటుంది.

మీరా—అల్లాంటి విషయాలన్నీ ఎవరుచూస్తారు?

ఇంగా—మరి బిడ్డమాటో?

మీరా—ఈరోజుల్లో బిడ్డలులేనివాళ్లెవరు?

ఇంగా—నువ్వు వేళాకోళం చేస్తున్నావో, వెక్కిరిస్తున్నావో నాకు తెలియడంలేదు. నాకుమాత్రం ఆవిషయం ఎంతో బాధగా - ఎంతో గడిబిడిగావుంది...అటువంటి ఘట్టం వస్తేగాని నీకు తెలీదు.

మీరా—తెలివితక్కువ! మళ్ళీ నిరుత్సాహం! (సైగచేసి తల ఎగరవేస్తుంది.) ఒక్కమాటచెప్పు. మాటలయ్యేయి...పనులుజరిగేయి. ఇంకా ఈఆలోచన లెందుకు?

ఇంగా—దారేమీ కనపడడంలేదు.



మీరా—అందరూకలిసి - మీరుముగ్గురూకలిసే కాపరం చెయ్యండి. అంతే!

ఇంగా—(ఆశ్చర్యంతో) ఏమన్నావు?...మన టూత్ బ్రష్ పరాయివాడికి ఎరువిస్తామా?

మీరా—ఓహో! బాగా జ్ఞాపకంచేసేవు. బ్రష్ తెచ్చుకోవాలి మరచేపోయేను.

ఇంగా—నీలో మార్దవం అనేదిలేదా యేం?

మీరా—మార్దవం అనేది బూర్జువాభావం.

ఇంగా—నామట్టుకి - మార్దవం మానవుడిలో ఉండాలసిన కనీసపు జ్ఞానం అనుకుంటాను. అది నీలో లోపించింది.

మీరా—మార్దవం విధిగా వుండితీరాలన్నావుకదా కొంపతీసి... సరిగ్గా చెప్పాలంటే, అందరిఆడవాళ్ళలాగే నువ్వూ అసూయపడుతూన్నావు. ఒకపడుచువాడిని ఇతరులతో పంచుకుందుకు అంగీకరించలేవు?

ఇంగా—ఉహు! నేను సహించలేను. మామూలువాటాలు - యథాలాభపుసంబంధాలు - ఒకరివిషయంలో ఒకరు తటస్థంగా వుండడాలూ ఇవేవీ నాకు కిట్టవు నేనెంత స్వచ్ఛంగావుంటానో నాసహచరుడుకూడా అలాగేవుండాలంటాను

మీరా—అమ్మో! అమ్మో!

ఇంగా—మీరా! వూరుకోతల్లీ!...నీధోరణి నాకు నచ్చడంలేదు.

మీరా—ఫ్యాక్టరీ మానేజరు...

ఇంగా—మీరా!

మీరా—పోనీలే!...(ఇష్టంవొచ్చినట్లు నువ్వు నాయిష్టం వచ్చినట్లు నేనూ వుందాం. మనలో ఎవరికి గటిబొప్పిలు కడతాయో చూద్దాం.

(డిమిట్రీ వస్తాడు.)

హో! ఇడిగో కథానాయకుడొచ్చేడు. ఇల్లారాబాబూ! రా, అవిడి వల్లా బాధ పెడుతూన్నావేమిటయ్యా! నిన్ను బాగా చెవులు

వలపాలే! వింటున్నావూ! ముద్దులూ - మురిపేలూనా? మీతంటాలు మీరు పడండి. మీమూలంగా నాతిండికూడా పోద్దోయింది. కళ్ళు మూత బడిపోతూన్నాయి. ముందు ఓకునుకు తీసి తర్వాత గోడపత్రికసంగతి చూడాలి. (గట్టిగా ఆవలించి, వెళ్ళిపోతుంది.)

డిమిత్రీ—ఈమారు బాగా తిన్నాడు. అముసిలాడి కెంత కోపం వచ్చిందో చూసి తీరవలసిందే. ఏడిపించేసేడనుకో. చూస్తే నాకే జాలేసింది...ఔను, కాని, ఏమల్లావున్నావు? (ఆగి) ... ఇంగా! ... ఆసంగతి మరిచిపో.

ఇంగా—(మనసులోనిబాధ మొహాన కనబడుతూండగా) డిమిత్రీ! మనమిద్దరంకూడా గతం అంతనీ మరచిపోవాలి.

డిమిత్రీ—ఏమిటి?

ఇంగా—మనకున్న సంబంధాలు!

డిమిత్రీ—(ఆశ్చర్యంతో) నీఅభిప్రాయం?

ఇంగా—ఇంక ఈమాదిరిగా కాలం గడపలేను. తెలుస్తూందా? ఊహుఁ. మనమిద్దరం ఒకేచోట పనిచేస్తువుండివుండకపోతే, నాకింత బాధ లేకపోవును. ఇప్పుడు నాపనికూడా చెడిపోయే స్థితివచ్చింది. (నిరాశతో) ఇంక ఈవిధంగా వుండడం నాతరంకాదు. దీనికేదో మార్గం చూసుకు తీరాలి. మనమిద్దరం ఏకమేనాకావాలి. లేదా ఒకరికొకరు సంబంధం లేకుండానైనా వుండాలి. అంతే. ఒక్కమాటు తేల్చివేసుకోవాలి.

డిమిత్రీ— ఇప్పుడేనా?

ఇంగా—ఇంకెప్పుడు మరి?

డిమిత్రీ—ఇంగా!......సంశయిస్తానని అనుకున్నావా? నాకు నువ్వు...నువ్వేరుగుదువు కా...ఇంతవరకూ నాజీవితం ఏలాగగడిచిందో? కేవలం జైలు - చీకటికొట్టు అసలు జీవితం అంటే ఏమిటో నేనెప్పుడేనా ఎరుగుదునా? ప్రేమంటే తెలుసునా? నీమాదిరి ఆడవాళ్ళు వుంటారని ఎన్నడేనా తలచేనా? వంటపని చేయడానికీ - బట్టలుతకడానికీ - కాదు. ఆలోచన లేనిమనిషి - పట్టిమాంసపుముద్ద కాదు నేకోరేది, ధార్ఢ్యంగలది;



నాకంటేనూ, అందరికంటెనూ సుందరమైనది; ఒక నిజమైన మనిషి కావాలి. ఇంగా! తేనెకంటెనూ నువ్వు మధురమైనదానివి.

ఇంగా—డిమిత్రీ! నిన్నిందుకోసం పిలవలేదు. గ్లఫీరా నో - నన్నో నిర్ణయించుకోలేనప్పుడీమాటలతో పనేమిటి?

డిమిత్రీ—గ్లఫీరాకోసంకాదు. ఆపిల్లకోసం నే పడుతూన్న బాధంతా... నాకూతురుకోసం...ముసిలివాణ్ణయిపోతూండడంచేత నేమో ఆపిల్ల అంటే అంత మమకారం ఏడ్పిస్తూంది.

ఇంగా—నీబిడ్డకోసం ఈలాగే - అసంతృప్తితో, మానసికవేదనతో కాలం గడపాలనుకుంటూన్నావా? నీ తెలివితేటలన్నీ స్తంభించిపోతూన్నాయే. ఎంత తెలివిగలవాడివి. ఇప్పుడేలావున్నావు?... అవన్నీ మాటలాడడం నాకిష్టంలేదు. అది నీస్వంతవిషయం. స్వయంగా ఆలోచించుకో. డిమ్కా! ఒకఆడదానిలాగా, చెలిమికత్తెలాగా మాటలాడడంలేదు. పార్టీసభ్యురాలుగా. కామ్రేడ్‌నిగా నీతో మాటలాడుతూన్నా. జాగ్రత్తగా ఆలోచించుకో.

డిమిత్రీ—నాకిది చాలాబాధగానేవుంది. ఇంగా! నాపనిలో నేనెప్పుడూ వెనకపడలేదు. కాని, ఈవ్యవహారం నాకేమీ కొరుకుపడడంలేదు. పెద్దఅరణ్యం! ఏమీతోచదు...ఏమిచేసేది? ఎవరికోసం బాధపడను. నా తల బద్దలైపోతూంది. విప్లవారంభంలో అన్నీ - గ్లఫీరాని - పియోట్కానీ కూడా వొదిలి తుపాకి తీసుకుని, వెళ్ళిపోయేను. 1919 లో - 1920 లో నాకూడా అంతే జరిగింది ... యుద్ధరంగంలోంచి వచ్చేను. గాయాలు కాస్త మానగానే మళ్ళీ గుర్రం - మళ్ళీయుద్ధం...పియోట్కాకి టైఫాయిడ్‌వచ్చి చచ్చిపోయేడు ... పాపం మూడేళ్ళయినా నిండలేదు. కాని, ఏంచేస్తాం? పెదవులు చప్పరించి వూరుకున్నా. అంతే! - కాని ఈవేళ పరిస్థితులు వేరు. నేను ఆలోచించాలి!

ఇంగా—డిమిట్రీ! ఆలోచించు. బాగా ఆలోచించు. కాని, త్వరలోనే ఏదో ఒకటి తేల్చు. ఈరోజుల్లో వ్యక్తివిషయాలకి అంత ఎక్కువకాలం పాడుచెయ్యడానికి వీలులేదు. నువ్వు వెంటనే నిర్ణయించుకుని, పనిచెయ్యి. ఒక్కక్షణంకూడా వ్యర్థంచేయరాదు. అధమం మనం

వ్యక్తి వ్యవహారాల బురదలో చిక్కుపోకూడదు. ఈమాదిరి దురవసల మూలంగా నిరుత్సాహపడి, కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ కూర్చోడానికి వీలు లేదు. చూసేవుకా... మనచుట్టూ పోరాటాలు సాగుతూనేవున్నాయి. ప్రతిరంగంలోనూకూడా వర్గకలహం తీవ్రంగా సాగుతూనేవుంది. ఎన్ని ప్రాణాలు - మనవాటికన్న ఎంతోవిలువకల ప్రాణాలు - జైళ్ళలోపడి మ్రగ్గిపోతున్నాయో! ఎంతమంది కార్మికుల పోరాటంలో ప్రాణాలు కోల్పోతూన్నారో! ధైర్యం తెచ్చుకో. మామూలుగా నీ పనులు నిర్వహించుకో, నేనేల నిన్న ప్రేమించేనో ఆ ప్రత్యేకత నిలువబెట్టుకో. ఈవిధంగా బాధపడడం మంచిపనికాదు....డిమ్కా! దేగనికోళ్ళగూట్లో వుండదు!

డిమిట్రీ—ఇంగా! నన్నేం చెయ్యమంటావు?

ఇంగా—ఒక్కటేమాట: నన్ను బాధపెట్టకు. పిచ్చెత్తించకు. ఈబాధ ఇంక సహించలేను. ఏదోదారి చూస్తావా - నన్ను చూసుకో మన్నావా?

డిమిట్రీ—నీ కేలా తెలుస్తుంది?...ఇంగా! నాకో ఉపాయం తట్టుతూంది. మనం ఇద్దరం ఓవారంరోజులపాటు దూరంగా ఎక్కడికేనా గాని, మాస్కోగాని పోదాం.

ఇంగా—తర్వాత?

డిమిట్రీ—తర్వాతేమిటి? ఏదో ఒకటి జరుగుతుంది...లేదా ఈ లోపుగానే అన్నీసర్దుకోనూ సర్దుకుంటాయి.

ఇంగా—ఏదో ఒకటి జరుగుతుందీ? ...దాని కదేసర్దుకుంటుందీ?... ఊహుఁ. ఆమార్గం నాకు నచ్చదు. ఈబంధం ముడిపడాలి. ముడిపడదూ తో చెయ్యవలసిందే. ఏదో ఒక్కటే. ఎన్నిబాధలు కలిగినాసరే. (డిమిట్రీకి దూరంగా వెడుతుంది. చాలసేపు మౌనం.)

డిమిట్రీ—ఇంగా...!

ఇంగా—(తనలో తానేమాటలాడుకుంటూన్నట్లు మెల్లిగా) ఏం, నేనే బాధపడడం ఎల? నేనే ఎందుకు స్వార్థత్యాగం చెయ్యాలి...కేవలం ఆమె పిల్లతల్లికావడమేనా కారణం? నేను పడుతూన్న శ్రమకన్న, బిడ్డని కనడం ఎక్కువ మహాత్కార్యమా?...నేనూ మనిషిని! మనుష్యుని హక్కు



లన్నింటినీ వొదులుకుని,...సమస్తం ఇతరులకి వొదిలివెయ్యవలసిందేనా? అందరిలాగే నేను మాత్రం సుఖపడకూడదూ? కాస్త స్నేహం - ప్రేమా అనుభవించకూడదూ?

డిమిట్రీ—(ఖండితంగా) ఇంగా! సరే! (ఒక్కక్షణం ఆగుతాడు; ఇంగా అతనివంక నడిచివస్తుంది.) ఊహుఁ! వారిద్దరినీ అలాగ వొదిలెయ్య లేను. తెలిసిందీ? కలెక్టివునంతనీ వ్యతిరేకించలేను, నన్నెవో బంధనాలు కట్టుతూన్నాయి.

ఇంగా—నువ్వుచాలా అసహ్యంగా మాట్లాడుతూన్నావు...మనం మాట్లాడుతూన్నదేమిటి? నే నేదో నిన్ను నిర్బంధంచేస్తూన్నట్లు అలాగ మాట్లాడుతావేం? నేను ఎవ్వరినీ త్యాగం చెయ్యమనడంలేదు. ఏంచేయవలసిందీ నిర్ణయించుకోలేకుంటే—ఈ చీకాకులన్నీ ఎందుకూ? ఒక్కగీటు పెట్టేద్దాం. అంతతోసరి. నీ మీద వొత్తిడితేవాలనే సంకల్పం నా కొంత మాత్రమూలేదు...నాకేమీ వద్దు...ఏమీ...ఏమీ...

(శూన్యదృష్టులతో నలుమూలలా చూస్తూంది. డిమిట్రీ ఏదో చెప్పబోతాడు. కాని, ఇంగా వారిస్తుంది.)

(డిమ్కా! ఇంక భరించలేను. నువ్వువెళ్ళు. (డిమిట్రీ ఆమెవంక వెళ్ళబోయి, అంతలో మనసు మార్చుకుని, వెనక్కి తిరిగి వెళ్ళిపోతాడు. ఇంగా వెనకతిరిగి అలాగే నిలబడి వుంటుంది.)

(తెర)

---

# రెండో అంకం.

## ఏడో రంగం.

కొత్తగా కట్టబడిన సహకారవసతిగృహంలో గ్రెచానినోవుగది. కలుచదరంగావున్న రెండు పెద్దకిటికీలు. కూలీ కుటుంబాలలో వుండేమాదిరిగా కొద్దిపాటి సామాను చిందరవందరగాపడివుంది. ఒకపక్క, డ్రాయర్ల పెట్టె; వంటసామగ్రి పెట్టుకుందుకో బల్ల; నాలుగుకుర్చీలు; తెరకి ఒకపార్శ్వాన కిరసనాయిలుపొయ్యి వున్నాయి. గిన్నెలు కడుక్కుందు కొక చిన్నతొట్టె; వంటపాత్రలు; పళ్ళేలు; తుండుగుడ్డలు; ఒకరొట్టె; కాబేజీ పువ్వు కొంతభాగమూ; కనబడుతూన్నాయి. టీ_కెటిల్ ఆవిరులు కక్కుతూంది. గదికి అడ్డంగా కట్టిన మూడుదండెములమీద విలువగల గుడ్డలు ఆరుతూన్నాయి. గదిలో ఒకవేపున ఊయెలవుంది. సమయం వెనకటి అంకం జరిగిననాటి సాయంకాలమే.

కొంచెం అలిసినట్లు కనబడుతూన్నా, గ్లాఫీరా అందమైనదే. బట్టలు ఇస్త్రీ చేస్తూంది. రెండుకుర్చీలమీద ఒక బల్లవేసి, దానిమీద తోముతూంది. జుట్టు చిందరవందరగావుంది. తలకి చుట్టపెట్టిన తెల్లని చేతిరుమాలులోంచి విడిపడి మొగం అంతా కమ్ముకుంటూంది. దుస్తులు చాల స్వల్పం. ఒకగౌను; స్కర్టు, గుడ్డస్టాకింగులు; స్లిప్పర్లు మాత్రమే వేసింది. పనితొందరలో అగ్నిష్ఠానం తప్పివున్నాయి. సోవియటుస్త్రీల దుస్తులకన్నా ఆమె దుస్తులు తక్కువగానే ధరించింది.

గ్లాఫీరా ఒకమారు చెవియొగ్గి, ఇస్త్రీపెట్టెక్రిందపెట్టి, ఉయ్యాలవద్దకుపోయి, తెరఎత్తి, లోనికి తొంగిచూస్తుంది. బిడ్డ నిద్రపోతూంటుంది.

గ్లాఫీరా—నిద్రపో చిట్టితల్లీ! నిద్రపో. (ఉయ్యాల వూపుతుంది.) హాల్కా! హాలెంకా! (రహస్యం చెబుతూన్నట్లుగా) ఎంతముద్దొస్తూన్నావో చిట్టితల్లీ, ముద్దుకూనా...నీకేం లోటులేదు తల్లీ! _ ఓ! మీనాన్న ఎంత దుర్మార్గుడైపోయాడే!



(గ్లాఫీరా కన్నీరు తుడుచుకుని, ఇస్త్రీబల్లవద్దకిపోతుంది. వెక్కుతూ భర్తయొక్క బరువయిన చొక్కా తీస్తుంది. పెట్టెకి ఏదో అడ్డువస్తుంది. ఆమె ఆపుతుంది. కంగారుగా అటూయిటూ చూస్తుంది. చొక్కాజేబు తిరగవేస్తుంది. నలిపివెయ్యబడిన చిన్నకాగితం క్రిందబడుతుంది. దానిని తీసుకుని, తెరుస్తుంది. అది చదవగానే వెక్కివెక్కి ఏడుస్తుంది. కాగితం చేతులోంచి క్రిందపడిపోతుంది. ఆమె మోకాళ్ళపై కూలబడి, ఇస్త్రీబల్లపై తలమోపి ఏడుస్తుంది.

నాస్త్యా లోనికి తొంగిచూస్తుంది. గ్లాఫీరా తల ఎత్తిచూసి ఏడ్పు ఆపుకుంటుంది, లేచి ఉతకనిబట్టలలోంచి ఒకగుడ్డపీలిక తీసి ముక్కు తుడుచుకుంటుంది. నాస్త్యా గంభీరంగా, సానుభూతిచూపే దృష్టులతో ఆమెవంక చూస్తూంటుంది.

నాస్త్యా—ఇంకా అతడు ఇంటికి రాలేదూ?

గ్లాఫీరా—లేదు...

నాస్త్యా—మాఆయన వచ్చేడు ... (అప్పుడే శాంతపడుతూన్న గ్లాఫీరావంక ప్రశ్నార్థకంగా చూస్తుంది.) ఏకల్తీలేని సైంధవలద్దుగాడు. వాడిరోగానికి మీటింగులోనే మందేసేరు. ఆడవాళ్ళకి ఎదురుతిరిగినందుకు గట్టిగా చీవాట్లు పెట్టేరు. కాని, వాడిజబ్బు ఈనాటిదా? ఏమాత్రంసందిచ్చినా నన్నుబాదినట్లే లోకంలో ఆడవాళ్ళందరినీకొడతాడు... మాకుపెళ్లి అయి ఇంకా పదహారేళ్ళుకాలేదు. చూడు నారూపు ఏలాగ తయారయిందో. మనుష్యమాత్రురాలుగా కనిపిస్తూన్నానంటావా? నావయస్సులోనున్న ఆడవాళ్ళంతా నెమళ్ళలా నవనవలాడుతూంటారు. వెనక ఒకమారుకాకపోతే ఒకమారేనా అద్దంలో చూసుకునేదాన్ని. కాని, ఇప్పుడు మానేశా. నారూపు నాకే భయంగొల్పుతూంది. (ఆకాశంవంక చూస్తూ గ్లాఫీరా నిశ్చలంగా నిలబడిపోతుంది. చేతులు వణుకుతూంటాయి.) ఏమిటల్లావున్నావు? ఇల్లారా. గ్లాషెన్కా! ఏమిటది? (గ్లాఫీరా ఏడ్పు హెచ్చుతుంది. చొక్కాకొంగులో మొగం దాచుకుంటుంది.) అబ్బే! అదేంపని! ... ఏదోపనిమీద ఆగిపోయి వుంటాడు. వచ్చేస్తూంటాడు...

గ్లఫీరా—అత డెక్కడున్నదీ ఎరుగుదును... ఇక్కడున్నాడు. (నాస్త్యాకి చీటి నిస్తుంది.)

నాస్త్యా—(చీటి తీసుకుంటుంది. కాని చదవలేక అటూ ఇటూ తిరగేస్తుంది.) ఏముంది ఇందులో? నేను చదవలేను. అవిద్యానిర్మూలన ప్రచారంలో కొద్దిపాఠాలు చదువుకున్నానంతే, నియడు. కాని, అన్నీ మరిచిపోయాను. మాసోఫ్రాన్ దగ్గరున్న వాళ్ళకి చదువుకూడానా?

గ్లఫీరా—(కన్నీళ్ళు తుడుచుకుని, చీటి చదువుతుంది.) 'డిమ్కా! నేను పదింటికి ఇంటికివస్తాను. తప్పకుండా రా..." (నిట్టూర్పువిడిచి ఆఖరు వాక్యం ఎంతో కష్టంమీద చదువుతుంది) "...ఇంగా!"

నాస్త్యా—(ఊపిరి బిగబట్టి వింటుంది.) ఆమెనుంచేనా? ఆవిడ నుంచే! నీకెక్కడదొరికింది? ఓహ్! ఎంత ఛండాలురాలు! వాడికేదో మందు పెట్టివుంటుంది! ఇల్లాంటి పెళ్ళాన్ని లేకుంటే వదలిపెట్టుకుంటాడా? మీరెంత సుఖంగావుండేవారు? ప్రతివాళ్ళకీ ఆదర్శంగా జీవించేవారే. కలియుగం! ఇదివరకూవున్నారు మనుష్యులు. ఎవరిపనివారు చేసుకొనేవారు. కాని, ఇప్పుడు దూడలోక పులుసుపెట్టేసట్లు పరుగులు. ఒకటే పరుగులు, తొత్తులాడుకులు. ఏమైపోతూన్నామోననే ముందు చూపే లేదు.

గ్లఫీరా—(ఇస్త్రీబల్ల కడ్డంగాపడి) నాస్త్యెంకా! నా పని అయిపోయిందే...

నాస్త్యా—వాళ్ళకి చదువుకున్న వాళ్ళు కావాలి. ఇప్పుడు మనం, ఈపిల్లలతో ఏంకావాలి? ఆపరాత్పరుడికి తెలియాలి.

గ్లఫీరా—నాకీ సంగతి చాలా రోజులుకిత్రమే తెలుసును. నా మనసుకి తట్టుతూనేవుంది. ఋషిపూజాదినంనాడు ఆకడినదత అంతా అదోవిధంగావుంది...అదివరకుఎంతమృదువుగావుండేవాడు...ఏవిషయాన్ని గురించయినా ఆతనితో మాట్లాడగలిగేదాన్ని...వేళాకోళం చెయ్యగలిగేదాన్ని...మాలో హెచ్చుతగ్గులేవీవుండేవికావు. దాపరికాలులేవు...కాని,



ఇప్పుడు! అంతా మౌనం. ఎవరో పరాయిదానికేసి చూసినట్లు చూస్తాడు. ఆతనితో వ్యవహరించడం ఏలాగోకూడా అర్థంకావడంలేదు. మాటలు పెదవిదాటడంలేదు. ఒకమాట చెప్పబోయి ఒకమాట చెప్తూన్నాను... (ఏడుస్తుంది.) ఒకొక్కప్పుడు నాకు నేనే ఆలోచించుకుంటూంటాను: ఏమిటిల్లా అవుతూంది? ఒక్కపలుకుకూడా ఆడలేనంతటి పిరికిదాన్ని ఎల్లా అయ్యాననుకుంటాను. (వెక్కివెక్కి ఏడుస్తుంది.) అతడంటే పెద్ద పులిలా కనబడుతూన్నాడు. మిట్యా! నా చెయ్యిదాటిపోయేవు! దాటిపోయేడు!

నా—చిలకా - గోరింకలమాదిరిగా ఎంతకలిసి మెలిసివుండేవారు!

గ్లఫీరా—ఆతని నోట ఎన్నడూ పరుషవాక్యం వినలేను. ఎప్పుడూ మనసు ఇంటిమీదనే వుంచేవాడు, అది బాగులేదు - ఇది బాగులేదని— ఎన్నడూ అనలేదు. ఎప్పుడూ నవ్వుతూండేవాడు. కాని, ఈవారం పులుసు బాగులేదంటాడు. మాంసం కుళ్ళిందంటాడు ...టీ బాగులేదంటాడు.... అన్నీ వ్యతిరేకం. నిద్రపోయేటప్పుడు బట్టలు తలగడాక్రింద దాచుకుంటాడు (ఎంతో విచారంతో ఆ చీటివంక చూస్తుంది.) ఆఖరికి కారణం— ఇదీ !

నా—ఆమెలో విశేషం ఏంవుందనుకున్నాడో.

గ్లఫీరా—నాకేమీ తెలీదు. (మరల ఏడుస్తుంది.) నాకేమీ తెలియదు నాతల తిరిగిపోతూంది. మిట్యానివిడిచి బ్రతుకలేను. ఆతడిని ఎవ్వరికీ దక్కనివ్వను. వాళ్ళిద్దరికీ విషంపెట్టి చంపుతా. (వుయ్యాలవంక చూసి, దానికేసి పరుగెత్తుతుంది.) వాలెంకా! వాలెంకా!!

నా—ఊరుకో...అన్నింటికీ ఆ దేవుడేవున్నాడు!...

గ్లఫీరా—(ఎప్పటోయున్న డిమిట్రీ నుద్దేశించి) ఎందుకీబిడ్డని శిక్షిస్తావు?...మనపిల్లనేనా చూడలేకపోయేవా?... ఎంతఅందంగావుందీ చూసేవూ?...కాల్కా ఎందుకు బాధపడాలి?... నిన్ను క్షమించలేను. నాబాధలు మరిచిపోగలను. కాని, బిడ్డ...నారక్త - మాంసాలు - ఈచిట్టిపాప - ఆమెకి జరిగే అపకారాన్ని సహించను.

నా—(గదిమూలలు. పరికించి) ఎక్కడా దేవుడి బొమ్మైనా లేకుండా కాపురం చేస్తున్నావు? ఈబాధ లన్నింటికీ మూలం అది. దేవుడిని ప్రార్థించాలి. దీపారాధన చెయ్యాలి. అప్పు డన్నీ సర్దుకుంటాయి. మీఆయన దారినిపడతాడు. లేదా సోదెచెప్పేవాడివద్దకెళ్ళు. మనవాయగునే ఒకర్తెవుంది.

గ్లఫీరా—నా కానమ్మకంలేదు. నాకు వేటియందూ నమ్మకంలేదు.

నా—నీఅభిప్రాయం ఏమిటి?

గ్లఫీరా—(ఒకసొరుగులాగి, ఒకదేవుడిబొమ్మని పైకి తీసుకుంటుంది.) ఇదిగో చిన్నబొమ్మ...ఇది మాఅమ్మది. మిట్యాకి తెలియకుండా దాచివుంచేను.

నా—మహామంచిపని చేసేవు! ఇప్పుడు పూజచెయ్యి, పూజ చెయ్యి!

గ్లఫీరా—(మొదట సంశయిస్తుంది. తర్వాత బొమ్మని ముద్దుపెట్టుకుంటుంది.) నేనేంపాపంచేశానయ్యా! (నిరుత్సాహంతో) ఊహు ఆయన గారువినడు. నాకు నమ్మకంలేదు. (బొమ్మ గిరాటువేస్తుంది.)

నా—ఎంతపనిచేసేవు! ఎంతపనిచేసేవు? (బొమ్మతీయడానికి హడావిడిగా వురుకుతుంది.)

గ్లఫీరా—(నిరుత్సాహంతో) ఎందుకు సమాధానం చెప్పకపోవాలి? ఎందుకు చెప్పకూడదంటా. (ఏడుస్తుంది.) ఇది వుండడంచేత నేనేమో మిట్యా అల్లా అయిపోయేడు. పూజచెయ్యడం ఎప్పుడేనా చూసేడేమో. నాస్తెంకా! అంధకారంలోవున్నా. ఏమీదారి కనపడడంలేదు.

(నాస్త్యా ఎంతోభక్తితో బొమ్మని ఆఘారం కొంగులతోతుడిచి చొరుగులపెట్టెమీద పెట్టి శిలువగీసుకుంటుంది.)

ఏమీ తెలియడంలేదు. ఒక్కటే తెలుసు. ఆతడు నాకు దూరం అయిపోయేడు. ఇంకా నావాడుకాడు. ఆవిడ వలలోపడిపోయేడు. మచ్చుమందుచల్లింది. కాలసర్పం! ఇతరుల బిడ్డలమీద దయతలచేనావదులుతుందేమో ననడానికి, అది గొడ్డుమోతు. పెళ్ళీ పెటాకులూ ఏమీ లేవు. సిగ్గూబిడియంలేదు. సిగ్గుమాలిన ముండలు, ఎవడుకనిపిస్తే వాడితోనే ఏడుస్తారు! కన్నుగీటితేచాలు! నాజీవితం ఎందుకు పాడుచెయ్యడం చెప్పు. ఎందుకంటా!



(గ్లఫీరా వెక్కి-వెక్కి ఏడుస్తుంది. ఏదో పోగొట్టుకున్నట్లుగా ఆమెవంకచూసి, నాస్త్యాగదిచుట్టూ కంగారుగా పరుగెడుతుంది. అది తీసి, ఆఖరుకి ఇస్త్రీకోసం తెచ్చిన నీటిమీద శిలువగీసి, వాటిని గ్లఫీరామీద చిలకరిస్తుంది. ఆమెమీదకూడా శిలువగీస్తుంది.)

నా—ఊరుకో, చాలులే, ఊరుకో.

(గ్లఫీరా శాంతపడుతుంది. తలఎత్తి శూన్యదృష్టులతో చాలసేపు ఎదుటచూస్తూ కూర్చుంటుంది. మౌనం.)

గ్లఫీరా—రేపటితో నాకు సెలవు ఆఖరు. మళ్ళీ ఫ్యాక్టరీకి పోవాలి. ఈలాగవుండి వెళ్ళడం ఎట్లాగ? ఆఖరుకి నాబట్టలేనా ఇస్త్రీచేసుకోలేదే.

నా—నే చేసిపెడతానులే. (గ్లఫీరా కృతజ్ఞతతో ఆమెని కావలించుకుంటుంది.) ఫరవాలేదులే. నాకుమాత్రం కష్టసుఖాలు తెలియవా? నీవున్నస్థితి అందరికీ అర్థంఅవుతుంది...దాన్నిగురించి బెంగపెట్టుకోకు... ఆఇస్త్రీఏదో నేను చేసిపెడతాను. అన్నీచక్కపెడతాను. కూర్చో.

గ్లఫీరా—ఏమీవొద్దులే. వొదిలెయ్యి. శ్రమపడకు. (మరల నిరుత్సాహంతో తలవ్రేలవేస్తుంది.) కాని పిల్లమాట...

నా—కూర్చోనువ్వు. ఆపిల్లవిషయంకూడా నేనేచూస్తాను.

గ్లఫీరా—వద్దులే. నేనేచూసుకుంటానులే. (గ్లఫీరా లేచి ఉయ్యాల వేపు పరుగిడుతుంది. బిడ్డ ఏడ్పు మొదలిడుతుంది. గ్లఫీరా ఊరుకోబెడుతుంది. నాస్త్యా బొమ్మముందు మోకరిలబడి, ప్రార్థించుతుంది. పెద్దగందరగోళంతో బోలికోవ్ ప్రవేశిస్తాడు. తాగి వొళ్ళెరగకుండావుంటాడు.)

నా—ఓరిదేవుడా! మాఆయన వచ్చేశురా బాబూ! (హడావిడిగా లేస్తుంది.)

(బోల్టికోవు నాస్త్యానూ, బొమ్మనూ చూసి చేతులూపుతూ అరుస్తాడు.:

బోల్టికోవు—మేము దేవుడిని ప్రార్థించం! మారిపబ్లిక్కులో దేవుడికి తావులేదు.

నా—ఛీ! పెద్దపులి! నాశకుడా!

బోల్టికోవు—(నాస్త్యావంక కోపంతో చూసి) బూర్జువాలని మళ్లీ అధికారంలోకి తేకుండా చెయ్యడానికి ప్రావిడెంయటు దేవుడితో పోరాడుతూన్నారు.

నా—మళ్ళీ తాగివొచ్చేవూ? నువ్వు కొంపకి రాకుండాన్నంటే ఎంతసుఖంగావుంటుంది? అడుగు పెడితే చాలు అన్నీ తగులడిపోతాయి.

బోల్టికోవు—నీతల పగలకొట్టేస్తా... పెత్తనాల కెందుకు ఏడిసేవు? వంటకూడా నేనే వండుకోవాలేం? అంతేనా? నన్నెవరనుకుంటూన్నావు?

నాస్త్యా—నెమ్మది! నెమ్మది! అరవబోకు!

(నాస్త్యా విచారంతో గ్లఫీరావంక చూస్తుంది. గ్లఫీరా ఊయొలవద్ద నిలబడి, పిల్లని జోకొడుతూ వూపుతూంది. ఆమె ఇవేవి గమనించడంలేదు. మూర్ఛావస్థలో వున్నట్లుంది.)

బోల్టికోవు—ఇంటిదగ్గర ఏడవడమూ, నాకింత ఉడకేసి పెట్టడమూ చెయ్యకపోతే ఏంచేసి తగులడుతావు? పొయ్యి చప్పగా చల్లారిపోయింది. నువ్విక్కడ పోసుకోలు కబుర్లు చెబుతూకూర్చున్నావు? నాలిక బుజాన వేసుకొని! ఇదేనా చెయ్యాలిసింది? ఉండు నీరోగం కుదురుస్తావుండు.

(బోల్టికోవు ఆమెవంక ఉరుకుతాడు. నాస్త్యా పారిపోతుంది. అతడు వెంటాడి, తూలికుర్చీమీద వొరుగుతాడు. కుర్చీక్రిందపడుతుంది.)

నాస్త్యా—నెమ్మది! నామీద పడబోకు. ఇదేం మనఇల్లు కాదు. నీయిల్లు వల్లకాడుగాను!

బోల్టికోవు—వెధవపురుగులకికూడా స్వాతంత్ర్యమే. (ఖాండ్రించి ఉమ్మివేస్తాడు.) ధూ! ఫ్యాక్టరీఅంతా ఇదేరకం. అన్నిడిపార్టుమెంట్లులోనూ ఆడాళ్ళే. నలభైఏళ్ళనుంచి ఏగోలాలేకుండా పనిచేస్తూన్నా. కాని వాళ్ళు అలాగ వుండనిస్తారూ? షాక్‌బ్రిగేడ్లుట - సోషలిష్టు పోటీలుట!... (మళ్ళీ ఉమ్మివేస్తాడు.) ధూ! మంచి అనుభవంగల నాబోటి "ఆపరేటురు" కూడా పోటీచెయ్యవలసిందేనా? ఆలోచించు. ఎప్పుడేనా, ఎవ్వరేనా విన్నారూ? ఆ బ్రిగేడ్ నాయకుడెవరు? ఓ ఆడమ్మాయి! మేనేజరు! ఆడది! ఒకగౌనూ - ఆవిడా! ఊం. ఏలాంటిగౌను? ఏలాంటి గౌనులూ? (తొడలవద్దకి సంజ్ఞచేస్తాడు.) ఇక్కడదాకా వున్నగౌను. ఏమంటావు? మనం ఎందుకొచ్చేం?...నన్ను మీటింగులో అవమానపరుస్తుందీ? నాకు శిక్ష వేస్తానని భయపెట్టడమా? (ఉమ్మివేస్తాడు.) తూ! బ్రహ్మరాక్షసులు! ఇదంతా ఏలవచ్చింది! ఈఆడవాళ్ళ పరిపాలన ఎప్పుడు వొదిలిపోతుంది? నాచేతులు - కాళ్ళూ కదలకుండా చేసేస్తున్నారు. వీళ్ళమొహంమండా! (ఒళ్లెరగక ఏడుస్తాడు. నాస్త్యా అమాయికంగా అతనిదగ్గరకు రాబోతుంది. అతడు మరల ఆమెమీదికి వురుకుతాడు. హుం. పిశాచపుముండా!



(బోల్టికోవు నేలతన్ని కుర్చీలు నేలబెట్టి కొడతాడు.)

నా—చాలించీపాటికి. ఇది మనఇల్లుకాదు. పెద్దమనిషితరహా అంటూ లేదాయేం? అంత సిగ్గువదిలేసి బరితెగించేవేం? అంత అల్లా తాగడానికి వేళ ఎక్కడ దొరికింది? మాఖోన్!

బోల్టికోవు—(కళ్ళుచికిలించి) ఆమాటే అనకద్దు. వద్దనేదిదానినే. విన్నావూ? ఏమాటయినా అంటే అన్నావుకాని, ఆవెధవమాట.

నా—శాంతించవోయి, చవటా!

బోల్టికోవు—ఆడదాని చెప్పుచేతలలో వుండేరకంకాదు. ఉండను. నేను ఎన్నటికీ షాక్‌బ్రిగేడ్‌లో చేరను. చేరేవాళ్ళని చేరనీ. నేనుమాత్రం పెళ్ళాన్నికొట్టడంలో ఏమీ లోపంచెయ్యదలచుకోలేదు. నాకిష్టం అయిందీ పీకినులిమిపారేస్తా. తోచిందీ స్వారీచేస్తా. నాకు తోచినట్లు చేసేస్తా. ఎవ్వరడ్డంవచ్చేవారు?

(అతడు తరుముతాడు. నాస్త్యా పరుగెత్తుతుంది. కుర్చీలు తగిలి క్రింద పడతాయి. ఇస్త్రీబల్ల, బట్టలతొట్టెలు, ఇస్త్రీపెట్టె, బోర్లపడిపోతాయి. ఆధ్వనికి చంటిబిడ్డ లేచి ఏడుస్తుంది.)

నా—ఓయమ్మో! ఓయమ్మో!

(ఈధ్వనికికూడా గ్లఫీరాకి తెలివిరాదు. ఆబిడ్డవిషయం ఎరగదు. కళ్ళు తెరిచి అంతా చూస్తూన్నా ఏంజరుగుతూందోకూడా ఎరగదు. బోల్టికోవు నాస్త్యా నింకా తరుముతూనేవుంటాడు.)

బోల్టికోవు—నిన్ను చీరేస్తా! నరికేస్తా!

నా—(గ్లఫీరా వెనక దాగి) అమ్మబాబోయి! చంపేస్తున్నాడే!

(వెనుకటి దుస్తులలోనే వెరోనికా ప్రవేశిస్తుంది. ఆశ్చర్యంతో బోల్టికోవు ఆమెవంక చూసి, నిలబడిపోతాడు. నాస్త్యా బిడ్డని ఊరుకోబెడుతుంది.)

వెరోనికా—ఈగోలేమిటి? ఏమీ తెలియకుండావుందే! ఫ్యాక్టరీ తాలూకు భవనంకదాయని పెంకలన్నీ విరగకొట్టవచ్చుననుకుంటున్నారా? బెత్తికలూడి మానెత్తిన పడుతూన్నాయే! మీకేంసిగ్గులేదు? మీరు పెద్ద చదువుకొన్న ప్రోలిటేరియమనుకుంటారే!

(బోల్టికోవుకి భయపడుతూన్నా, వెరోనికాకి సమాధానం చెప్పడానికి నాస్త్యా ముందుకొస్తుంది.)

నా—ఈపాటికి ఊరుకో! ... ఇది నీఅబ్బ గడించిన ఇల్లుకాదు. ఇందులో నీకెంత అధికారంవుందో మాకూ అంతేవుంది. సిగ్గా!...నువ్వు శిల్కుబట్టలుకట్టుకొని, వేలిగోళ్ళకికూడా మెరుగులు దిద్దుకూర్చుంటావు. అతడు పగలల్లా చాకిరీచెయ్యాలి!...అతనిజీవితం అంతా అలాగే గడిచింది...ఎప్పుడూ అంతే. అలాంటప్పుడు తాగేడంటే ఆశ్చర్యం ఏముంది?...

వెరోనికా—నేనూ పనిచేస్తుంటానని నీకు తెలియదా?...ఆశ్చర్యం! (చుట్టూ చూసి) బట్టలు ఆరవేసేరూ? ఆమూల అంత చెమ్మగావుందేమిటి? ఈదుర్వాసనలో ఎలాబ్రతుకుతూన్నారు?



(హఠాత్తుగా గ్లఫీరాకి తెలివివస్తుంది. వెంటనే వెరోనికావేపుగా ఒకఅడుగువేస్తుంది.)

గ్లఫీరా—ఇక్కడినుంచి ఫో. వెళ్ళవేం?

బోల్టికోవు—మేడమీదా ఆడవాళ్ళు. క్రిందా ఆడవాళ్ళు. ఓరినాయనా! ఆడమళయాళంరాబాబూ! ఎక్కడచూసినా ఆడవాళ్ళే.

(బోల్టికోవు రెండుచేతులతో తలపట్టుకుని తిట్టుకుంటూ పరిగెత్తిపోతాడు. ద్వారంలో అప్పుడే నిశ్శబ్దంగా, విచారంతో లోనికి రాబోతూన్న డిమిట్రీతో గుద్దుకుంటాడు.)

డిమిట్రీ—ఏమిటీగోల? ఏంజరిగిందేమిటి?

గ్లఫీరా—(వినబడీవినబడనిగొంతుకతో) మిట్యా?

నా—(వారిరువురివంకా మారిమారిచూసి) సోఫా నిక్కడకే వచ్చేడు. ఆబాధకి విరుగడలేదు. వాడు తాగివచ్చేడంటే కొంపలోంచి పారిపోవడం ఒక్కటే శరణ్యం!

డిమిట్రీ—పరుగులెత్తడానికి మీయిల్లు చాలలేదా? ఏం మనుష్యులురా నాయనా?

(డిమిట్రీ కుర్చీనిలబెడతాడు. గ్లఫీరా హడావిడిగా ఇస్త్రీపెట్టె, బట్టలతొట్టెలు, బల్ల ఎత్తడానికి పరుగిడితుంది. నాస్త్యా తోడ్పాటుతో అవన్నీ సరిచెయ్యబడతాయి.)

వెరోనికా—కామ్రేడ్ గ్రెచానినోవ్! నువ్వు ధైర్యమనిషి. ఇప్పుడు జరిగిన అవమానకరదృశ్యం జరక్కుండా చూడవలసిన పూచీనీది. మాయింటికి కొందరు స్నేహితులు వచ్చేరు. రోమన్ ఫ్రాంట్సేవిచ్ చచ్చేలా అలిసిపోయివచ్చేడు ...సాయంకాలం అంతా అతడికి నిర్మాణసమావేశంలోనే సరిపోయింది...ఇంటికివచ్చేటప్పటికి ఇదిగో ధమ్! ధమ్!! చప్పుడు కొంచెంసేపు వెన్నువాల్చుదామంటేలేదు. ఈలావుంటుందని తెలుస్తే, అసలు ఇల్లు మారకనేపోదుం. అధమం ఏది ఏలావున్నా మీరు పార్టీసూచనలనేనా గౌరవించి తీరాలి.

డిమిట్రీ— పార్టీ సూచనలేమిటి?

వెరోనికా—గౌరవనీయులయిన స్పెషలిస్టులయిన మాకు కావలసిన సౌకర్యాలు చూడాలని.

డిమిట్రీ—ఇదిగో విను! గౌరవనీయులయిన స్పెషలిస్టులు కానీ, మరేం కానీ, నీతో మాటలాడేపాటి వోపిక లేదు నాకు. నేనూ ఒక్క నిమిషం విశ్రాంతి తీసుకోవాలి.

వెరోనికా—అయితే అబ్బాయి! ఆ కుర్చీలూ, బల్లలూ. అలా గిరాటు పెట్టబోకు. (వెళుతుంది)

(ఉద్రేకంతో డిమిట్రీ ఆమె వెనక బయలుదేరబోయి. మరల ఆగి అసహ్యంతో చేయి విసురుకుంటూ మరో మూలకి నడుస్తాడు.)

నా—ఈ చదువుకున్న వాళ్ళంతా ఇదే మచ్చు. శృంగారపు బొమ్మలు! (భావగర్భితంగా డిమిట్రీ వంక చూస్తూ వెళుతుంది.)

గ్లఫీరా—మిటెంకా! అన్నం వడ్డించేదా?

డిమిట్రీ—నాకేమీ వద్దు.

గ్లఫీరా—పోనీ 'టీ' పెట్టేదా?

డిమిట్రీ—నాకేమీ వద్దని చెప్పేను...ఏమిటీ దుమ్ము. పందుల దొడ్డిలా చేసేవేమిటి? తుడవడానికి కూడా ఖాళీ లేకపోయిందేం?

(ఎంతో ఉద్రేకంతో చెవి నలుపుకుంటాడు. జేబులో చేయి పెట్టి, జేబురుమాలు తీసి, చేతులు తుడుచుకుంటాడు.)

గ్లఫీరా—(వెర్రినవ్వు నవ్వబోయి) సెంటు వాడుతున్నావే. మంచి సెంటే. ఎందుకు తుడిచివేసుకుంటావు? (హఠాత్తుగా ఉద్రేకం పొంది.) మిట్కా! నీకు తెలివనేది లేదు! ఏం జరుగుతూందో నువ్వెరగవు! మా అందరి ప్రాణాలూ తీస్తున్నావు! కాని, మాతోపాటు నీ ప్రాణం తీసుకుంటున్నావు!

డిమిట్రీ—ఏమిటీ గంద్రగోళం! పిచ్చిగాని ఎత్తలేదు గద? (దేవుడి బొమ్మ చూస్తాడు.) ఏదో కొత్త వ్యవహారం వచ్చిందే. దేవతల కొలువు



చేస్తూన్నావా యేమిటి? (చొయుకుల పెట్టెమీదనుంచి బొమ్మ విసిరికొడతాడు.) (క్రిందపడి)

గ్లఫీరా—మిట్కా! నా ప్రాణం తియ్యకు. నా సుఖం పాడు చెయ్యకు. [అతని కాళ్ళు పట్టుకుంటుంది.]

డిమిట్రీ—కాస్త సేపు వొదులు నన్ను, స్థిమితంగా కూర్చోనియ్యి. పగలెల్లా చచ్చేలా పని చేసి రావడం—మళ్ళీ ఇక్కడ - (ఆవిడని లేవదీసి) ఈ వేళ నీళ్ళుపోసుకున్నావా? పాడుకంపు కొడుతున్నావు.

గ్లఫీరా—నామీద అసహ్యం కలిగిందన్న మాట. ఆమాట స్పష్టంగా చెప్పరాదూ? ఎందుకు నన్ను మభ్యపెట్టబోతావు? నాతో అబద్ధమాడడం ఎందుకు?

డిమిట్రీ—గ్లఫీరా! ఇంతవరకు నిన్ను మభ్యపెట్టలేదు. పెట్టదలచలేదు. ఏమిటి నీ వరసఅంతా.

గ్లఫీరా—(చీటీ చూపించి) మభ్యపెట్టలేదు? ఇది చూసేక కూడా ఆమాట అనగలవా? నీకు హృదయం అనేది లేదు. (ఊపిరిబిగపట్టి) తుంటరీ!

(డిమిట్రీ ఆ కాగితం తీసుకుని, నెమ్మదిగా మడతపెట్టి, దూరంగా వుంచుతాడు. కొద్దిసేపు మౌనం)

డిమిట్రీ—సరే, అంతేలే. (విషాదంతో నవ్వుతాడు.) సరే అదేదో తేల్చుకుందాం!

గ్లఫీరా—తేల్చుకోవడమా?

డిమిట్రీ—ఎంతకాలం ఈలాగ బాధపడడం? చూడటం లేదూ? ఒకరికొకరం ఏలాగ దూరం అయిపోయేమో!

గ్లఫీరా—దూరం అయిపోయేమూ? ఈ పదకొండేళ్ళూ, జరిగిన దేమి? పిరోట్కా సంగతి ఏమిటి?

డిమిట్రీ—నిజమే—కాని, కాలం మారింది. పరిస్థితులన్నీ మారిపోయినాయి.

గ్లఫీరా—వాల్కా మాట ఏమిటి?

డిమిట్రీ—వాళ్ళని విడిచిపెట్టను. నేను ఎక్కడవుండనీగాక ఎప్పటికీవాళ్ళకి తండ్రినే. (ఆమె చెయ్యి పట్టుకుంటాడు.) గ్లాషా! అసలు విషయం అర్థంచేసుకో. వయస్సుతోపాటు నాలో పూర్తి మార్పు వచ్చింది. వెనక జీతాలు వచ్చినరోజున నాకో వాచీగొలుసు, నీకో రుమాలూ, కొనడమో, ఇద్దరం సినీమాకి పోవడమో, సెలవులలో తీర్థాలకి పోవడమో ఇంతేకా. ఇంటికివచ్చేటంతకి ఈబట్టలు! ఈమురికి! కాని, ఇప్పుడు తెలివివచ్చింది. జీవితం అంటే తెలిసింది. ఇంకా తెలుసుకోవాలనేవాంఛ కలిగింది...ఇప్పుడు నాగోల నీకేమీ అర్థంకాదులే. మన ఇద్దరిభావాలూ వేరైపోయినాయి.

గ్లషీరా—మనభావాలు వేరైనాయీ? గాయపడి, టైఫాయిడుతో, నాదగ్గరకి చేరినప్పుడు; నీకు సేవలుచేస్తూ కంటిమీద కునుకులేకుండా చాకిరీచేసినప్పుడు; స్కాలరుషిప్పుతో జీవిస్తూ రాత్రీపగలూ పుస్తకాలు చదువుతూ, వర్కర్సు స్కూలులో నువ్వు చదువుకుంటూండగా, రాత్రీపగలూ కుటుంబమనుతోనే దేవులాడినప్పుడు; రోగం వచ్చి నువ్వు చావుకి సిద్ధం అయినప్పుడూ; మనభావాలు ఒకటేనా, వేరా?...అప్పటి మనభావ ఏమిటోయి! ఓమారు జ్ఞాపకం చేసుకో.

డిమిట్రీ—ఇప్పుడదంతా ఎందుకు? ప్రస్తుతంమాట చెప్పుతూన్నా!

గ్లషీరా—నేను వెనకటి విషయాలు—నీకోసం గడిపినసంవత్సరాలు జ్ఞాపకంచేస్తున్నా. నీవిషయం నువ్వు జ్ఞాపకం వుంచుకున్నావు. బాగానే వుంది. కాని, నేనేలాగ బ్రతుకుతూన్నానో ఆలోచించేవూ? నేనెంతశ్రమ పడుతూన్నాను? నీకదేం అక్కరలేదు. నువ్వు సైన్యాలలోవుండగా నేం నింటివద్ద వట్టినే కూర్చున్నాననుకున్నావా? నీ కొడుకును పెట్యాషాని పెంచిన దెవరు?

డిమిట్రీ—అదెందుకు? పెట్యాషా చచ్చిపోయేడు. దానిని గురించి మాట్లాడిన లాభం ఏమిటి?



గ్లషీరా—నిజమే. చచ్చిపోయేడు. కారణం ఏమిటి? నాలో చిన్నం ఎత్తు శక్తికూడా లేకపోవడంచేత చచ్చిపోయేడు. ఆకలికి చచ్చిపోయేడు. నావొంటిమాంసం కోసిఇవ్వడం మినహా, నా ఓపికగలంతవరకు ఆతడిని బ్రతికించడానికి అన్నివిధాలా తంటాలుపడ్డాను. సుఖంగా గడిపెనయ్యా ఆరోజులు! ఆయింట్లోవుంటే కోటేస్కృకూడా కొరడుపారిపోయేటంత చలి. నాకు టైఫాయిడు, పినోట్కాకి టైఫాయిడు!...ఆకలి. కొంపలో కాస్త రొట్టయినా లేదు. చెప్పడం సులభమేకాని, అటువంటి దురవస్థ లనుభవిస్తూ జీవించడంకంటె యుద్ధరంగంలో తుపాకీతీసుకోడం చాలా సులభం!

డిమిట్రీ—(ఖచ్చితంగా) ఇంతకంటె నువ్వు చెప్పగలది ఏమన్నా వుందా?

గ్లషీరా—నాజీవితం అంతా...యావత్తూ నీకోసం వినియోగించేను. ఈవేళ నీకు తెలియడంలేదు గాని.

డిమిట్రీ—ఏమిటోయి నువ్వుచేసింది. బట్టలు చిరిగితే కుట్టిపెట్టేవు? వంటచేసిపెట్టేవు? ఇరవైరూబుల్లు పారేస్తే ఆఖరుకి ఆన్యాస్తాకూడా ఆమాత్రం పనిచేసిపెడుతుంది.

గ్లషీరా—నాస్త్యా!...నిజమే కాని నాఆదరణ! నాప్రేమ?...వాటికేం విలువకడతావు? ఆచిరుగుల చొక్కాలు కుట్టేటప్పుడు ప్రతికుట్టులోనూ నాప్రాణంపెట్టి కుట్టానని ఎప్పుడేనా ఊహించేవా?

డిమిట్రీ—ఇదిగో ఈపిచ్చిగోరణి కట్టిపెట్టు!...నాకాళ్ళకి - చేతులకీ బంధాలువేసి ప్రాణాలర్పించుతేమాత్రం నేనేంచేసుకోనది? మరోగతి లేదాయె. నీకు చదువు చెప్పుదామనుకున్నా. పేపర్లు చదివి వినిపించేను. మీటింగులకి తీసుకుపోయేను...నీకాసరదాయే లేనిదే! ... ఏదేనా ఒక మాట చెప్పబోయేవా - వట్టితెలివితక్కువగా మాట్లాడేదానివి. నీమూలంగా అందరిముందూ సిగ్గుపడవలసివచ్చేది. ఇవన్నీ ఎందుకు?...ఇంక మనం ఇద్దరం కలియలేము. నువ్వు చదువుకోవచ్చు. ముందుకి రావచ్చు. కాని

నేను ఎప్పుడూ నీముందేవుంటా. నీకోసం కనిపెట్టుకొని కూర్చుండిపోతా ననుకుంటున్నావా? లేక నిన్నుకూడా ఈడ్చుకు ముందుకుపోగలననుకుం టూన్నావా? ఈభారం ఈడుస్తూ, ఒంటికాలికుందేనకట్టు ఆడలేను.

గ్లఫీరా—(తలవ్రేలవేసుకొని) మిటెంకా! (ఏడ్పు)

డిమిత్రీ—అదిగో! ఏడ్పులు - పెడబొబ్బలు! మహాఅందమైన జీవితం. చాలు!

గ్లఫీరా—(ఖచ్చితంగా నిలబడి) నిజం! ఇంగా ఈలావుండదులే.

డిమిత్రీ— ఈలాంటిదే అయితే నే ప్రేమించేవాడినే కాదుగా.

గ్లఫీరా—అసలుసంగతి ఇది. మరోదారిలేకపోవడంకాదు. కుంటేన కట్టు ఆడడంకాదు. దానివలలో వేసేసుకుంది. అసలువిషయం అది. మిగిలిందంతా మసిపూసి మారేడుకాయచెయ్యడమే!

డిమిత్రీ—నీకేమీ తెలియదు. ప్రయోజనమూలేదు.

గ్లఫీరా—ఆవిడని ప్రేమిస్తూన్నానని నువ్వే చెప్పేవుకాదూ?

డిమిత్రీ—ఔను. ప్రేమిస్తూన్నా! ఇదివరకెప్పుడూ ఎరగనంత అధికంగా ప్రేమిస్తూన్నా. అంత అధికంగా ప్రేమించగలనునే సంగతే ఇదివరకెరగను. నీకంటె నేను చాలా ముందుకుపోయేను. ఈలాగే వుండిపోయేవంటే ఇంగా - నేను ఇద్దరం నాశనం అవుతాం.

గ్లఫీరా—నువ్వు నాశనం అవుతావా? అయితే నామాటేమిటి? నా పని ఇదివరకే పూర్తి అయింది! ఈవిధంగా కాలంగడపటం ఏలాగో నాకేమీ అర్థంకావడం లేదు. కాని. నీకాగోలపట్టదు. హుం. (ఏడవడం ఆరంభిస్తుంది.) మిట్యా! మిటెంకా! నిన్నెంత ప్రేమిస్తూన్నానని! (అతణ్ణి కౌగలించుకోబోతుంది.)

డిమిత్రీ—(విసుగుతో విదిలించుకొని) ఈపాటికి చాలించు. ఏమిటిదంతా ఎందుకు?

(గ్లఫీరా ఉయ్యాలాపై వొరిగి ఏడుస్తుంది. డిమిత్రీ ఎంతో కోపంతో నేల తాటిస్తాడు.) - చాలించు. నోరుముయ్యి!



గ్లఫీరా—చిట్టితల్లీ! వాలెంకా! నేనేమైనా అయిపోతే నిన్ను కనిపెట్టేదిక్కుడే తల్లీ! తండ్రిలేడు. ఇల్లులేదు...

డిమిత్రీ—నాప్రాణాని కెక్కడదాపరించేవే! (కోపంతో ఆవిడని ఊరుకోపెట్టబోతాడు. కాని అంతలోనే మనసుమార్చుకుంటాడు.) ఉహుం లాభంలేదు!... మరికాస్త బాధ! (మౌనం) బట్టలు ఇస్త్రీఅయినాయా?

గ్లఫీరా—(కన్నీళ్ళతోనే) లేదు.

డిమిత్రీ—ఆబుట్ట ఇల్లా పడెయ్యి.

గ్లఫీరా—ఏది?

డిమిత్రీ—(ఒక బుట్ట తీసుకుని) ఇదీ...

గ్లఫీరా—(వెక్కి వెక్కి ఏడుస్తూ) ఇది పిల్ల బట్టలు వేసుకొనేది మరొకటేదేనా తీసుకో. అది మాత్రం తీసుకోవద్దు.

డిమిత్రీ—పోనీలే. ఇబ్బందిలేదు. ఒక కాగితంలో చుట్టబెట్టుకొని పోతాను. (తన బట్టలు తీసుకుంటాడు.) ఏం పూర్తి చెయ్యవా?

గ్లఫీరా—(ఆశ్చర్యంతో) డిమిత్రీ! చాలా దూరంపోతూండే!... (కోపంతో) బట్టలక్కడే ఇస్త్రీచేయించుకుంటావా?....ఎక్కడికిపోతున్నావు?...ఇక్కడికి చేసిన చాకిరీచాలురాబాబూ! కడుపునిండింది!

డిమిత్రీ—(కంగారుతో) మరేంలేదు?...తనగుడ్డలుతీసి, మడతపెట్టి, ఒక కాగితంలోచుట్టి అక్కడేపడేస్తాడు.) అదల్లావుంచు. నాసామానంతా రేపు తీసుకుపోతాను. గుడ్ - బై, గ్లఫీరా!

(అతడు వెళ్ళిపోతాడు. గ్లఫీరా కళ్ళప్పగించి చూస్తూ, స్తబ్ధురాలై నిలబడిపోతుంది. ఒకక్షణం తర్వాత మొహంనిండా గాయాలతో నాస్త్యా వస్తుంది. ఆమె బట్టలు చిరిగిపోయినై ఒక కన్ను వాచింది. జుట్టంతా చిందరవందరగావుంది.)

నా—ఏమైంది?...(చుట్టూ తిరిగి చూసి గ్లఫీరావద్దకువచ్చినిలబడుతుంది.) ఏమైంది?

గ్లఫీరా— వెళ్ళిపోయేడు...ఆవిడదగ్గరకి...నాస్త్యా! వెళ్ళేడూ? (బొమ్మ నేలమీద పడివుండడం చూస్తుంది.) ఓరిదేవుడా! ఈవేళ నే అప్పుడే రెండుమూళ్లు దేవతావిగ్రహాన్ని నేలబారవేసేరేమర్రా! (తీస్తుంది) ఏమిటిది? వీళ్ళ మొహం మండినమగాళ్ళుగాని. ఎవరేనా కాస్త తేనె నాకిస్తే చాలు. మనం పెట్టేపిండివంటలు కూడా వదిలేస్తారు. వాళ్లకి మన అరసరంలేదు. (తనని మాపుకుంటుంది.) మావాడు, మాకాత్యుసిపీనుగ నాకెల్లాంటి అలంకారాలిచ్చేడో (ఆదరంతో సంజ్ఞచేస్తుంది.) కుంపటిమీద గిరవాటేసేడు. అదీవ్యవహారం! ... ఇదేం మొదటిమారు కాదు...నాబ్రతుకంతా ఇంతే!...గ్లఫీరా! కాస్త టీ చేసిపెడుదునా?

గ్లఫీరా—(ఆశ్చర్యంతో ఆమెవంక చూస్తూ) నాకేమీ వద్దమ్మా! ఏమీవద్దు! నోటికి హితవులేదు. ఏదో భయంగావుంది! నాస్త్యా! ఒళ్ళు తిరుగుతూందికూడాను! ఏమీ ఆధారం లేదుకదా !

(హఠాత్తుగా కిటికీవేపు పరుగెత్తి దానిలోంచి 'ఏసిటిక్ ఆసిడ్' పలుకులున్న సీసా తీసుకుంటుంది)

నా—(పరుగెత్తి, ఆమె చెయ్యిపట్టుకుంటుంది.) గ్లఫీరా! ఏమిటీపని? మతిపోయిందా?

(చిన్నకుస్తీ గ్లఫీరా తంటాలుపడి కాస్త ద్రావకం మింగుతుంది. నాస్త్యా సీసాలాక్కుని పారేస్తుంది.)

ఇల్లాంటి పనిచెయ్యడానికి బుద్ధి ఏలాగ పుట్టింది? ఎంతపాపం! ఎంతపాపం!...పిల్ల మాట ఏమవుతుందనుకున్నావు?

గ్లఫీరా—(రెండుచేతులతోనూ గుండెలదుముకుంటూ, ఉయ్యాల వంకచూసి) వాలెంకా! చిట్టితల్లీ! నాబిడ్డా!

(ఏడుస్తూ, గ్లఫీరా ఊయెలకడ్డంగా పడిపోతుంది. చంటిబిడ్డ కెవ్వన అరుస్తుంది.)

నాస్త్యా—ఏమిటిచెయ్యడం ఇప్పుడు! నాకు తుదా, మొదలూ తెలియకుండావుందే!



(గ్లఫీరా బాధతో గిలగిలలాడుతూంటుంది. నాస్త్యా సహాయంతో లేచి కూర్చోబోతుంది.)

గ్లఫీరా—వాలెంకా! వాల్కా! లోపల దహించుకుపోతూంది. (క్రిందపడి దొర్లుతుంది.)

అమ్మోయ్!...ఏలామండిపోతూందేవ్? నేనేంపాపంచేసేను! అమ్మాయీ! చిట్టితల్లీ! మెలేసేస్తూంది. ఓరిదేవుడా! నాపని ఏంకానురోయ్!

(నాస్త్యా ఏమిచెయ్యడానికీ తోచక, ఆవిడవద్ద నిల్చుని శిలువ గీస్తుంది.)

నాస్త్యా—దేవదేవీ! కరుణించు.

(తెర)

## ఎనిమిదో రంగం.

(వెనుకటి రంగంలోవున్నట్టే గ్రాచానినోవు గది. చాలారోజుల తరువాయిమాట. ఉదయంపూట. సూర్యోదయంఅయింది. గ్లఫీరా మంచం మీదపడివుంది. మంచంప్రక్కనే చిన్నబల్ల. దానిమీద మందులసీసాలు. నిశ్శబ్దం. సోమోవు ప్రవేశిస్తాడు.)

సోమోవు—ఏం. ఆత్మఘాతినీ! ఏలావున్నావు? స్తిమితంగా వుందా? కొద్దికొద్దిగా? (గ్లఫీరా తలగడలో మొహం దాచుకుంటుంది.) అదేమిటి? మళ్ళీ ఏడుస్తూన్నావూ? గ్లఫీరా! (దగ్గరికివచ్చి జుట్టు నిమురుతాడు.) వెర్రిదానా! అన్నిచెప్పినా నీధోరణి మానేవుకాదు. సిగ్గులేదూ?

గ్లఫీరా—(ఏడుస్తూ) మిట్యానితలుచుకుంటే ఏడుపువస్తూంది.

సోమోవు—మిట్యా! ఇప్పుడు మిట్యామాటెంవచ్చింది? వాడిపనేం వచ్చింది. నువ్వుమాత్రం మనిషివికావా?

గ్లఫీరా—నేను మనిషినే. కాని, అతను కుక్కకన్న నీచంగా చూసేడు. ఒకపుల్లని చూసినట్లు చూసేడు. అతనికోసం పడ్డశ్రమ - ఆ

ప్రేమ ... మొహాన ఉమ్మేసేడు. కమ్యూనిస్టు నడవవలసిన విధానం అదేనా? చేతనైనంతవరకు పీల్చి పిండేసి అవతలపారవేస్తాడూ? తానుబాగా పెరిగేడట! పెద్దకబుర్లు చెబుతాడు. కాని, ఎవరివీపుమీదనిలబడి తానింత పెద్దవాడయేడు. ఎవరిపీకపట్టుకు వ్రేలాడి నిలబడ్డాడు. ఆతని ఈఅభివృద్ధికి సాయపడ్డదెవరు?...కమ్యూనిస్టుట!

సోమోవు—ఆతడేం మంచిపనిచేసేడనడంలేదు. వాడు చేసింది వట్టి పాడుపని. చెడ్డదే. (తొందరగా) కాని, ఎవరిహృదయాలనీ కనిపెట్టలేము. పూర్వకాలపు దాసత్వం తెచ్చిపెట్టడం మనసంకల్పంకాదు. అదికూడా నిజమే! కాని, ఈవిషయంలో ఆతనిది కొంతవరకుమాత్రమే తప్పు. నిన్ను అభివృద్ధిలోకి తీసుకురాలేని లోపం ఆతనిదే. ఆతని తప్పు అది...ఈతప్పుకి ఫ్యాక్టరీలో అందరూ ఆతనికి గట్టిగా చీవాట్లు పెడుతూన్నారు. (మౌనం) నువ్వు...ఆతడిని తిడుతూన్నా ఇంకా ఆఅభిమానం వదలలేదు.

గ్లఫీరా—పదకొండేళ్ళ అనుబంధం. ఏం నవ్వుతాలుకాదు. నేనాతడిని ప్రేమించేను. ఇప్పటికీ ప్రేమిస్తూన్నా. ఏమైనా వాల్కా అతని బిడ్డే కాదూ?

సోమోవు—నిజమే! కష్టమేకూడా! (మరల దృఢనిశ్చయంతో) తెంపుకోవాలి. పూర్తిగా వొదులుకోవాలి. గ్లాషా! వెనకటిది పూర్తిగా మరచిపోయి స్వతంత్రజీవనం ఆరంభించు. మొన్న నీకిచ్చిన పుస్తకం చదివేవా?

గ్లఫీరా—చదివేను...దానిమీద ఎంతో ఆలోచించేనుకూడా.

సోమోవు—నచ్చిందా?

గ్లఫీరా—గ్రిగరీ! నాకాపాటి సామర్థ్యం వుంటుందనుకోను. ఒంటిదాన్ని. బలహీనురాల్ని. పైగా వాల్కా...

సోమోవు—వాల్కాని నర్సరీకి పంపవచ్చు. నీకు జీవచేరుతుంది. నువ్వు తెలుసుకోలేకపోయినా శక్తి దానంతటది వచ్చేస్తుంది. ఆత్మవిశ్వాసం వొదులుకోకు. గ్లఫీరా! వెనుకటి అభిప్రాయాలన్నీ త్రోసెయ్యి. నూతనజీవితం ఆరంభించు. ఈరోజులు అలాంటివి. పురాతనపుచెత్త అంతా వొదిలి



పోతూంది. ఇంకా నేనువెనకబడుతున్నానని వాళ్ళంతా దెప్పుతున్నారు. అయినాసరే. ఇప్పటికీ నాలో పోరాటంలో పాల్గొనడానికి శక్తివుంది. నువ్వింకా చిన్నపిల్లవు! బ్రతికినంతకాలం బ్రతకవలసినదానివి. కాని, కన్నీళ్లు కారుస్తూ ఏడుస్తున్నావు. పనిచేయి! చదువుకో! నూతనజీవితం ఆరంభించు. ఎందుకు ఏడవడం? ఇదివరకు మిట్యా ఒక్కడే నీప్రేమకి పాత్రుడు. నిన్ను కాపాడేవాడు ఆత డొక్కడే. ఈవాళ ప్రపంచం అంతా నీదే. ఈకలక్టివ్ అంతా నీకు సాయంచేస్తుంది!...ఇంక వొంటివాన్నంటావా? సరిఅయిన దారిలో పడేవరకూ నీకు మేమంతా సాయంచేస్తాం. వింటున్నావూ? మరోవిషయం ఏమిటంటే నిన్ను జాగ్రత్తగా కాపాడే పూచీ నాది. సరా?

గ్లఫీరా—(చిరునవ్వుతో) గ్రిగరీ! ఎంతమంచివాడివి? నీకెంత దయ గలగుండే!

సోమోవు—అందరివిషయంలోనూ ఇంత దయగావుండను.

గ్లఫీరా—నామట్టుకి నాకే సిగ్గవుతూంది. అన్నిపనులు చేసుకుంటూన్నా, నావిషయం ఇంత బాధపడుతూన్నారంటే.

సోమోవు—తప్పదు. తప్పదు. గ్లఫీరా! ప్రతిఒక్కని జీవితమూ ఇప్పుడెంతో విలువగలది. మీరంతా నాసైన్యం. జీవితం విషయంలో పార్టీకి, ఫ్యాక్టరీకి నేనే బాధ్యుడిని. ఒకమహాయుద్ధం జరుగుతూంది. ఈపంచవర్ష ప్రణాళికలో ప్రతిఫ్యాక్టరీ ఒక్కొక్క కందకం. నూతనజీవితంతో కూడుకున్న కందకం. సైన్యంయొక్క జీవితాలకి ఆపదవచ్చినా, ఆకందకాలలో అలజడిపుట్టినా, బాధ్యత ఎవరిది?

గ్లఫీరా—(నవ్వుతూ) సరేలే. నువ్వే యోధుడివి. సేనాధిపతివి!

సోమోవు—కాదు. ఆర్గనైజర్ని!

గ్లఫీరా—(లేస్తూ) అయితే మేమందరం నిన్ననుసరిస్తాం. తప్పకుండా! డానిలిచ్! నేనారోగ్యంపొంది తీరతా. పొందడానికి సర్వశక్తులూ వినియోగిస్తాను.

(లేవబోతుంది. సోమోవు చిరునవ్వునవ్వి మళ్ళీ పడుకోబెట్టి, శాంత పరుస్తాడు. ఆతడిని కాదనడానికి తగినంత వోపికలేక గ్లఫీరా చిరునవ్వు నవ్వుతుంది.)

సోమోవు—అన్ని పనులూ చేస్తాం. కారణం మేము బోల్షివిక్కు గ్లఫీరా! బోల్షివిక్కులం.

(తెర.)



# మూడో అంకం.

## తొమ్మిదో రంగం

ఫ్యాక్టరీ కుట్టుపనిశాలలో ఒకభాగం తేనెపట్టుమాదిరిగా మహా హడావిడిగావుంది. రెండువరసలుగావున్న కుట్టుయంత్రాలు ఝుంయ్‌మని పనిచేస్తున్నాయి. వానిమధ్య పొడుగ్గా వున్నబల్లమీద కుట్టుపనిచేసే పడుచులు కూర్చుండివున్నారు. వారిలో చాలమంది కమ్యూనిస్టుయువదళ సభ్యులే. కప్పుకి పెద్దపెద్ద దీపాలు వ్రేలగట్టబడివున్నాయి. ఒకవేపున ఎఱ్ఱనిగుడ్డమీద తెల్లని అక్షరాలతో వున్న జెండా కేళిలాడుతూంది. "పంచవర్ష ప్రణాళికలోని మూడవసంవత్సరపు టుంచనాని దిగతొక్కాయ్యాలి" గుట్టలుగుట్టలుగా దుస్తులు బల్లలమీద చేతులు మారుతూన్నాయి బల్లలకి రెండువేపులు ఇద్దరుస్త్రీలు నిలబడివున్నారు. ఒకతె కొత్తసరుకు అందిస్తోంటే, రెండవయామె పూర్తిఅయిన దానిని తీసివేస్తోంది. ఈరెండవ స్త్రీ గ్లఫీరా. ఆమె పూర్తిగా మారిపోయింది. షాక్‌బ్రిగేడ్‌లోని కార్య ప్రోత్సాహం ఆవిడలో పూర్తిగా కనుపిస్తోంది. దుస్తులు శుభ్రంగావున్నాయి. వెనుకటిమాదిరిగానే సాధారణమైన దుస్తులే వేసుకుంది. ఎఱ్ఱటి జేబురుమాలు అందంగా తలకి చుట్టుకుంది, జుట్టుకత్తిరింపించుకుంది. మనిషిలో వెనుకటికంటె అందమూ, ఆత్మవిశ్వాసమూ ద్యోతకం అవుతూంది.

గ్లఫీరా—షాక్‌బ్రిగేడర్లంటే మీరే!

మొదటియువతి—ఏం? ఆయాసంవచ్చిందా?

గ్లఫీరా—(ఉత్సాహంతో తల ఎగరేస్తూ) ఫరవాలేదు. ఈదేస్తా.

రెండవయామె—అంగీకరించేవాళ్ళుంటే ఈవిడ ఈదేస్తుందిట.

గ్లఫీరా—ఈఅయిదోబల్ల వొదిలి - మరోచోట - మాటవరసకి ఆ ముసిలమ్మలున్నచోట పనిచెయ్యమంటే - చస్తేవెళ్ళను.

మొదటియువతి—మనబల్ల కాపేసువుంది! (సగర్వంగా) పంచవర్ష ప్రణాళికలోని మూడవఏడాదినాటి మొదటి కమ్యూనిస్టుయువదళం మనది. ఊం. ఓపాటువిసరండి.

మూడవయామె—అలాగే కాని. పనిసాగయ్యాక. (మొదటియామె ప్రారంభిస్తుంది.)

నీ హృదయములో 'కిమ్' * స్మృతి
చిహ్నమన్నదుంటే—
నిలబడవోయ్! ధైర్యముతో
భయమన్నది ఏలోయ్!

(క్రమంగా జనంఅంతా పాటలో కలుస్తారు. పని మరింత ఉత్సాహంగా సాగుతుంది. గ్లఫీరా కూడా పాట అందుకుంటుంది. బోల్టికోవు ప్రవేశం. దానిసపోతూ నిలబడివింటాడు. పిల్లలు కనుసంజ్ఞలుచేసుకుంటూ మరింత బిగ్గరిగా పాడుతారు. ఆతడు అసహ్యంతో ఉమ్మువేస్తాడు.)

బోల్టికోవు—ధూ! మీరిక్కడికి పనిచెయ్యడానికి వచ్చేరా? పాడుకోడానికి వచ్చేరా?

మొ_యువతి—మేం చేసినట్లు పనిచెయ్యిచూద్దాం.

బోల్టికోవు నీతో వంతక్కరలేదు. నాపని ఎప్పటిలాగే చేసుకోగలను.

రెం॥యువతి—కాని, మేం కొత్త పంథాలో చేస్తాం పని అనేది గౌరవకరం—పౌరుషభరితం' అన్నాడో మహానుభావుడు.

మొ॥యువతి—ఎంతపని జరిగిందో తెలుసా? ప్లాను ప్రకారం 112% అందరికంటే మేమే ముందున్నాం.

గ్లఫీరా—(బోల్టికోవుతో) చేతనైతే ఓడకుయ్యి!

రెండోయువతి—అమ్మ! వెళాకోళమే!

---

* కమ్యూనిస్టు యువజనదళం.



బోల్టికోవు—(గొణుక్కుంటూ) వీరిముండ మొయ్య! జీవితం అంతా తగలబెడుతూన్నారు!...పాటూటే సాగుతేనా?...

మొ॥యువతి—చాలుచాలు! పనికిరాండి—లేదా బాతాఖానీ వేస్తూన్నారని రిపోర్టుచెయ్యవలసి వస్తుంది. (మరల పాట అందుకుంటుంది.

నీ హృదయములో 'కిం' స్మృతి
చిహ్నమన్నదుంటే!

(ఇతరులతోపాటు గ్లఫీరాకూడా అందుకుంటుంది. బోల్టికోవు రోషంతో పిడికిలి బిగించి ఆమెవేపు చూస్తాడు. గ్లఫీరా నవ్వుతుంది. ఇంగా—సోమోవు-సెమ్ఛేన్సవిచ్‌లు హడావిడిగా ప్రవేశిస్తారు. సోమోవు బోల్టికోవు భుజం పట్టుకుంటాడు.)

సోమోవు—కామ్రేడ్ బోల్టికోవ్! మతిపోయిందా? పనిచేసేటప్పుడీ అల్లరా? కుర్రవాళ్ళకి మంచి ఉదాహరణ మిస్తావే? కొంచెం జాగ్రత్తగావుండు. అబ్బాయి! నీకే చెప్తున్నా నీతో గట్టిగా మాట్లాడాలసిన పనుంది. ముందు పనిలోకివెళ్ళు.)

(నవ్వుతూన్న కమ్యూనిస్టు యువతులవేపు కోపంతో చురచురా చూసి, బోల్టికోవు వెళ్ళిపోతాడు. ఇంగాని చూడగనే గ్లఫీరా తెల్లమొహంవేసి పెదవులు కరచుకొని, కుంచించుకొని, పనిలో కొంగుతుంది. ఇంగా ఆమె వేపే చూడదు.)

ఇంగా—రోమన్ ఫ్రాంట్సేవిచ్! 'కానీ'లు పనికి రావు. కొత్త ఏడాదివాటికి 'కన్వేయరు' పనిలోనికి పెట్టితీరాలి. ఏం జరుగుతూందో చూసేవా?

(గ్లఫీరా ఒక్కక్షణం ఏమరడంవలన బల్లకొసని తుటికా ఏర్పడ్డ కురుకువంక చూపిస్తుంది. గ్లఫీరా పని త్వరత్వరగా చెయ్యడానికి ప్రయత్నిస్తుంది. పని బహుచురుకుగా జరుగుతూంటుంది.

సెమ్ఛేన్సవిచ్—మనకి యంత్రాలు ఉండితీరాలి.

సోమోవు — ఊడిపోవాలి? అయితే వూడిపోతాయి. తప్పదు. కొత్త ఏడు వచ్చేటప్పటికి ఈ శాలలో యంత్రాలు ఏర్పరచాలి. (పనివారితో) అంతేనా?

ధ్వనులు — నిజం! ఇప్పటికే ఆలస్యం అయిపోయింది!... పని మొండిపడుతూంది.

ఇంగా — ఇది నిశ్చయమే. కర్వీయరు పెడితే మీరెంత పని చెయ్యగలరు.

మొదటియువతి — రెట్టింపు. మా బల్లవాళ్ళం 200% సిద్ధం

(గణగణ గంట మ్రోగుతుంది. అందరూ ఆనందంతో పనివదలి వేస్తారు.)

ధ్వనులు — భోజనానికి వేళయింది... చాలు లెండి, చేసింది!...

(అందరూ నలుమూలలకీ తిరుగుతూంటారు. పెద్దరణగొణధ్వని. మళ్ళీపాట ప్రారంభం అవుతుంది.

నీ హృదయములో 'కిమ్' స్మృతి
చిహ్నమన్నదుంటే.

(తెర)

## పదోరంగం.

ఫ్యాక్టరీలోని కమ్యూనిస్టుపార్టీ ఆఫీసులో కొద్ది క్షణాలు తరవాత. గతరంగం ఆఖరున వినబడిన గంటచప్పుడూ, ఇతరధ్వనులూ తెరలో వినబడుతూంటాయి. ఒక మేజా, ఒక బల్ల, చాలా కుర్చీలూ గదిలో వున్నాయి.

మీరా మేజావద్ద కూర్చుని వ్రాసుకుంటూంటుంది. రైజోవు ఆమె ప్రక్కన నిలబడి వుంటాడు.

రైజోవు — (గడియారం చూసి) భోజనానికి వేళ అయింది. లే, తినివద్దాం.

మీరా — తీరిక లేదు,



రైజోవు — మరచిపోయే.

(మేజాకొస నానుకుని కూర్చుంటాడు, గడియారపు గొలుసుతో ఆడుకుంటూ.)

మీరా — ఇగ్నట్! నా వరాలు తోడేస్తున్నావు!

రైజోవు — ఏవరాలేమిటి?

మీరా — అసహ్యంగా, వెకిలిగా, మాట్లాడకు లేచిపో. నన్ను పని చేసుకోనియ్యి!

రైజోవు — భోజనానికి గంటకొట్టేసు... పని సమయం కొద్ది... కాని, నీపని మరోచోటవుందని నీకుమాత్రం తెలీదూ?

మీరా — ఏమిటోయ్! ఎక్కడేమిటి?

రైజోవు — నా సెత్తిమీద నువ్వుకూడా ఏ అభాండం పడెయ్యవు కద!... ఈమధ్య నీమనసు మనసులో లేదులే.

మీరా — నాతల పగిలిపోతూంది. ఎవరిని చూసినా మహాచిరాకు వోస్తూంది. నిన్ను చూస్తే మరీని.

రైజోవు — ఇంతలో అంత మార్పెలవచ్చింది?

మీరా... మీమగవాళ్ళున్నారే, వట్టిపశువులు! అందులో నువ్వు వట్టి, మరీ, జంతువువి!

రైజోవు — బాగు, బాగు!... ఈవేళ ఏదోవుంది, అమ్మాయికి.

మీరా — మీ మగాళ్ళ దగ్గిరికి "కామ్రేడ్లీ"గా వస్తారేవరేనా? మీ దృష్టి ఎప్పుడూ ఒక్కవెంపే. ఛండాలం! ఏమాటలాగినా అట్లే! మీ మీపేరు చెప్పితే తలఏరు. ఇక్కడ ఒక్కర్తినీ కూర్చుని, ఎవ్వరితోటీ మాట్లాడకుండా కూర్చుంట్గా, అందుకే.

రైజోవు — పెటీబూర్జువా ఐడియలిజం!

మీరా — నువ్వో పశువ్వి... ఆడవాళ్ళకీ — మగవాళ్ళకీ మధ్య ఎంతవరకు చనువుండాలో నీకర్థంకాదు.

రైజోవు — పోనీ నువ్వు చెప్పరాదూ?

మీరా—అల్పబుద్ధివి! సంకుచితమనస్కులవాడివి! వ్యసనపరుడివి! అర్థంఅయిందా? అల్పబుద్ధీ—స్త్రీవ్యసనం.

రైజోవు—(మేజామీదినుంచి వురికి) ఈ పెద్దపెద్ద కబుర్లు చాలించు. శరీరశాస్త్రరీత్యా స్త్రీ-పురుషులు అంతా ఒకటే. ఇంక మీ ఆడవాళ్ళున్నారే అన్నీ బయటికి లాగడానికే చూస్తారు...ఆ చంద్రుడు...పడవ...షికార్లు...ఓ చిన్నపాట పాడమంటావా? "దాదండక్కొచ్చి" ఆడించమంటావా? (వెక్కిరింతగా) నాముద్దుగుమ్మవే. నా ప్రేమరాశివే. (ఉమ్మివేస్తాడు.) థూ! నాజీవితంలో ఈలాంటి కోపధారి. దీనికోసం నాకాలం ఎన్నడూ పాడుచేసుకోలేదు. ప్రేమంటే ఏమిటో తెలుసా. కట్టి ఆకాంక్ష - పరస్పర ఆవశ్యకత - అంతే. ఏమిటి చూస్తున్నావు? ఏదేనా నల్లికాదుగదా? (భుజం మీద చూసుకుంటాడు.)

మీరా...నిన్నే చూస్తున్నా. (భుజాలుకుదుపుకుంటుంది.) పుంధాకోరా! ఒకసిగరెట్టు పారేసి, తగులడు ఇక్కడినుంచి...(లేచి, సిగరెట్టు వెలిగించుకుంటుంది.) ఛో.

రైజోవు—తొందరపడకు! నీకు మహాపొగరుబలిసింది. వొదులుస్తాలే.

(ఆమెతో కుస్తీ ఆరంభిస్తాడు. సోమోవు ఎడమవేపునుంచి గదిలో ప్రవేశించి కళ్ళఅద్దాలమీదుగా వారివేపు చూస్తాడు.)

సోమోవు—ఆడుకుంటున్నారేం? ... ఇంతకంటే మంచిపోటు దొరకలేదు?

రైజోవు—ఇప్పుడేకా గంటమోగింది. విశ్రాంతి తీసుకుంటున్నాం.

సోమోవు—ఇంగా పూరికే తొక్కిపెట్టడం లేదు నీకితం. నీకు అలాగ జరగవలసిందే.

రైజోవు—(ముఖకళ హఠాత్తుగా మారుతుంది.) మళ్ళా తొక్కిపెట్టిందా!

సోమోవు—అహా! నేనిప్పుడే జీతాలపట్టీ చూసేను.



రైజోవు—గ్రిగరీ! ఏమిటీపద్ధతి? మనుష్యుల్ని బాధించదలచుకున్నారా? (కంఠం పెద్దదిచేసి) ఒకమాటు, రెండుమాట్లు, ఊరికే మాటవరసకి చేస్తే చెయ్యవచ్చును. క్రమశిక్షణ అంటే ఏమిటో నాకూ తెలుసు. సంఘం ఆపనిచేస్తే నేను ఏమీఅనను. కాని, ప్రతిమాటూ అది ఇల్లాగ చేస్తాంది...ఇదేం జైలులో కూలిపనా? నన్నేమనుకుంటున్నారేం? కూలిసనా? మీఅందరికీ విదూషకుడినా?

సోమోవు—అరవకు! - నెమ్మదిగా చెప్పవచ్చు.

రైజోవు—గ్రిగరీ దానిలిచ్! నాసంగతి నీ వెరుగుదువు. నేను త్రాగవచ్చు..ఇంకా ఎన్నేనా పనులు చేయొచ్చు. నాలో తప్పులున్నాయని నే నంగీకరిస్తా. కాదనడంలేదు.

సోమోవు—కానీ;

రైజోవు—ముప్ఫైఏళ్ళు నిరసనగా అణిచిపెట్టబడిన నేను అంతకంటె ఎక్కువగా వుండలేను. నన్నేంచెయ్యమంటావు? ఇప్పుడు...నిజానికి నాకు ఒకప్రధానమైన ఉద్యోగం ఇచ్చేరు. మొటమొదట నన్ను కమిస్సారుగా ఎన్నుకున్నారనే సంగతి నువ్వూ ఎరుగుదువు. నన్నప్పటినుంచీ ఎరుగుదువు. దానిముందర ఇది ఎంతఉద్యోగం?

సోమోవు—ముఖ్యమైన వుద్యోగమేం? నిజం! అయితే అంతకంటె ముఖ్యమైన వుద్యోగం ఇవ్వవలసిన సమయం రాలేదంటావా?

రైజోవు—ఆవిషయం నీకే బాగా తెలుసును. నేనొక్కటే చేసేను. నాలో డీవియేషను వుండవచ్చు. ఉన్నా అది ప్రొలిటేరియను డీవియేషనే. (వెక్కిరిస్తూన్న మీరావంక తిరిగి) నిజం? ఏం మాంకరిస్తావేంగురు? నీ ఇంగామాట చెప్పు. ఆమెది బూర్జువా డీవియేషన్. మీరు నన్ను 'ఎక్స్పెల్' చెయ్యాలనుకుంటున్నారు. నేనొక్కటే విషయం ఎక్కడచెప్పినా - ఆఖరుకి సెంట్రల్ ఎక్జిక్యూటివ్ కమిటీ - ముందరైనా - ఒకేవిషయం చెప్పదలచుకున్నా. తండ్రి ఏలాంటివాడుగానీ, మరేలాంటి మొగవాటాలుండనీ, ఇంగాలాంటివాళ్ళని తరిమెయ్యాలి!

సోమోవు—ఇగ్నట్! ఈపాటికి చాలించు! ఆమెవంటి పనివారికి ప్రోత్సాహం ఇవ్వాలి...నిజం...ఒక్కొక్కప్పుడు ఆమె తప్పటడుగు వెయ్యవచ్చును...మనదృష్టిలో నేనుమీ...ఉదాహరణకి ఈవిషయమే!

మీరా—మళ్లీ గ్లఫీరా వ్యవహారం కాబోలు నేం? ఇంగాకి ప్రేమించే అధికారం లేదేమో నేం?

సోమోవు—ప్రేమ! ప్రేమ! ఛీ రండలా మహాఅరుస్తున్నావు. ఇతరుల్ని బాధించేలా ఎవ్వరూ ప్రేమించకూడదు. మారోజులలో మేమూ ప్రేమించేం. కాని, ఇతరుల హక్కులు నిరాకరించి మాత్రం ప్రేమించలేదు.

మీరా—ఈవిషయంలో ఇంగానికాని, డిమిట్రీనిగాని అనవలసిన పనిలేదని నానమ్మకం.

సోమోవు—నీనమ్మకం కావచ్చు. కాని వుందని నేనంటాను. ఫ్యాక్టరీఅంతా వారిని నిందిస్తూంది. ఆవిషయమే ఎక్కడవిన్నా!

మీరా—(వెక్కిరింతగా) కావచ్చు ... పెట్టీ బూర్జువాజీకి మన నెత్తిమీద పెత్తనం ఇస్తే సరి!...

సోమోవు—అది పెట్టీ బూర్జువాధోరణికాదు. శ్రామికుల సహజభావనయే అది!

రైజోవు—నిజం! నాకూ...

సోమోవు—నోరుముయ్యి! అసలు నీకు భావనఅంటూ ఏడిసిందా ఏమిటి?

(రైజోవు చిన్నపుచ్చుకొని వెళ్ళిపోతాడు.)

సోమోవు—స్పష్టంగా చెప్పేసెయ్యి, మీరా! కుటుంబం అనేది అవసరం అంటావా? కాదంటావా?

మీరా—ఈకుండలు! ఈచాకిరేవులు! ఈఅనుమానాలు! ...మహాప్రభో! అంతకంటె నరకంమేలు!

సోమోవు—కుండలు _ చాకిరేవులు _ అనుమానాలతోటీ కూడుకున్న కుటుంబంమాటకాదు నేచెప్పేది...ఒకకొత్తరకం కుటుంబం! అవ



సరం అంటావా? కాదా? ఆకుటుంబపద్ధతి ఏలావుండాలో మనశ్రామికవర్గం ఎరుగును. దానిని సాధించడానికే వారు కష్టపడుతూన్నారు. సాధించి తీరుతారు. ఈనూతనకుటుంబపద్ధతిని గుర్తించకుండా మనకి 'కుటుంబవిధానమే' వద్దనేవారికీ, 'మాకు అధికారం వద్దు _ సైనికబలంవద్దు' అనేవారికీ తేడాఏముంది? నిర్మొగమాటంగా చెప్పాలంటే ఇవ్వన్నీ కౌంటర్ రివల్యూషనరీ ధోరణులే! నేడు శ్రామికవర్గం మానవజాతిలో చెరిసగంగా వున్న స్త్రీజాతిని విప్లవరంగంలోకి తీసుకురావడానికి ఏవిధమైన కుటుంబపద్ధతిని నిర్మించబోతూందో దానికి ఇది పెద్దదెబ్బ!

మీరా—హో! హో! హో! ఛాందసం! కాదు, కామ్రేడ్! ముసిలివాడివైపోతూన్నావు, ఊహాపథంలో విహరిస్తున్నావు!

సోమోవు—మీనెమ్ జేస్నివిచ్ లూ, ఈదంపతులు (విడిపోయిన ఆ జంటవంక చెయ్యిచూపుతాడు.) ముందు నేను వట్టి ఊహాపథంలో విహరిస్తూన్నట్లే కనపడవచ్చును. కాని, ఈఊహావిహారాల కోసమే నేను జైళ్ళలో మగ్గేను. శ్మశానం_సమాధికోసం ఎంతోకాలం వ్యర్థంచెయ్యవలసిన పీడ తప్పింది. ఆరోజులు జ్ఞాపకం వచ్చినప్పుడు ముచ్చెమటలుపోసి, వణికిపోతూ లేస్తూంటాను, నిద్రలోంచి......నామట్టుకి నేనే. (చేతితో అభినయిస్తూ) అంగుష్ఠమాత్రంగా తయారయిపోయానా అనిపిస్తూంటుంది. మా తల్లిని మాతండ్రి తెగబాదేవాడు. నాకు బాగా జ్ఞాపకం ఎన్నటికీ మరిచిపోలేను. అజ్ఞానంలో_మూర్ఖత్వంలో మునిగివున్న మానవజాతిలో ఒకభాగం మానవమాత్రులుగా సంచరించాలనే నాభావన వట్టిచాదస్తంకాదు. స్త్రీపురుషులమధ్య ఉభయులకీ సమానమయిన_స్వేచ్ఛతో కూడుకున్న_స్నేహభరితమైన_కలయిక ఏర్పడాలనేది నా ఆదర్శం. ఈనలభైఐదుఏళ్ళనుంచీ నేను సాగిస్తూన్న పోరాటంయొక్క ఆదర్శం అదే. ఎన్నైనా కబుర్లుచెప్పవచ్చు. కాని, కట్టుబాట్లన్నీ రద్దుచేసి, ఈమాదిరివాళ్ళని (రైజోవుని చూపుతాడు.) స్వేచ్ఛగా వదిలేశావా......

రైజోవు—చంపేసేవు! ఏమిటది?

సోమోవు—ఓమాటు ఆలోచించుకో నీకే తెలుస్తుంది. ఏం తెలియదూ? సరే చెప్తా పోనీ విను. గర్భపాతాలు అధికం అవుతాయి. శిశుహత్యలు ఎక్కువౌతాయి. లక్షలకొలదీ అనాథశిశువులు తయారవుతారు! ఫలితంగా, ఈమాదిరినమూనాలు (మళ్ళీ రైజోవును చూపి)-వలసినన్ని వున్నాయిలే మనలో—మళ్ళీ వాళ్ళని వెనకటిదారికే తోసేస్తారు. అదీ జరిగే సంగతి! నేల విడిచి సాము పనికిరాదు!......నేను ఇంగా అంటే ఎంతో అభిమానపడతాను. ఆ నిర్మొగమాటం, ఆపట్టుదల చూస్తే నాకెంతో ముచ్చట. నిర్భయంగా, జీవిస్తుంది. కాని, అయితేనేం,...చెప్పేదెల్లాగో తెలీటంలేదు...ఆమె పెరిగిన వాతావరణం అంతా సహజమైనది. తండ్రి బోల్షెవిక్, విదేశాలలో ప్రవాసం...ఆవిడా విదేశాలలోనే పెరిగింది కాని, ఈ కోట్లకొలదీ జనం?... ఈదేవుళ్ళని కొలుస్తూన్నారు. వంటింటో పొగలకి ఉక్కిబిక్కిరైపోతూన్నారు. దెబ్బలు తింటూ జీవితాంతంవరకూ గాయాలమచ్చలతో కాలం గడుపుతూన్నారు. ఇంగావంటివాళ్లెందరో నీకు చూద్దామన్నా కనపడరు. ఈసంగతి మనం మరిచిపోకూడదు. కోట్లకొలదీ వున్న ఈ ప్రజల వాంఛలు వేరు. వారికి కుటుంబాలు అవసరం. మీబోటి వాళ్ళకి—చదువుకొన్న మీబోటి పడుచువాళ్ళకి 'ఫ్రీలవ్' గొడవ. కాని, వాళ్ళకి...ఇంతకంటె ముఖ్యమైన విషయాలు సవాలక్ష వున్నాయి.

రైజోవు—అదీ సరయినమాట! అదీ! బూర్జువాధోరణి దుళ్ళగొట్టు

(ఇంగా—సెమ్‌ట్స్యేవిచ్‌లు ప్రవేశిస్తారు.)

సెమ్‌ట్స్యేవిచ్—(ద్వారంలోంచే) పార్టీవిషయాలు మాటలాడటం లేదుగదా? రావచ్చా? (ప్రవేశిస్తాడు.)

ఇంగా—(రైజోవుతో) మళ్ళీ నన్ను గురించా? నా నమూనాల్ని గురించా?

రైజోవు—మళ్ళీ!...మళ్ళీ నాజీవితం దిగలోకేవుటగా!

ఇంగా—(అతని స్వరాన్ని అనుకరిస్తూ) మళ్ళీని! నమూనాలు నెల్లాళ్ళలో తయారవుతాయి. ఆనాటికి మళ్ళా 200 రూబుల్లు కూడబెట్టగలుగుతావు.



రైజోవు—గ్రిగరీ! దీనికి నీ వేం చెప్తావు?

ఇంగా—ఇన్నెట్! ఈమాటలవలన ప్రయోజనం ఎంతమాత్రంలేదు. నీకేం లాంగ్‌మెంటుంకాదు. ఎందుకంటూవా—నేను చేసేది సరయినపని. రెండోది నీ నీలాపనిందలకీ—బెదరింపులకీ బెదురుతానని నువ్వు అనుకోనక్కర్లేదు. నువ్వు నన్నేం అప్రతిష్ఠపాలు చెయ్యలేవు. చెయ్యడానికి నీవద్ద ఋజువులేమీ లేవు. అందుచే ఇంకనువ్వు చెయ్యగలది నాపరిశోధనలకి తలవంపులు తేవడం...ఓ...కానీ. ఇదిగో అవకాశం వచ్చింది. ఇప్పుడు మనం అమలుపరుస్తూన్న వాటికంటె నా నమూనాలు చెడ్డవని నిరూపించు. నేనూ అంగీకరిస్తా.

రైజోవు—నిరూపించేటందు కేముంది? లక్షరూపాయలిచ్చినాసరే మాకు ఆ బూర్జువాసౌందర్యాలతో నిమిత్తంలేదు. సుందరవిగ్రహాలా? మన్మథప్రతిమలా? ఏమిటిదంతా? నూరుగురు దాసీల్ని పెట్టుకుంటేమాత్రం నేను మన్మథుణ్ణి కాగలనా?

సెమ్‌ట్స్యేవిచ్—అంతకి తక్కువైతే పనికిరాదా?

రైజోవు—మనకి రావలసింది శ్రామిక సౌందర్యం. ఆ సౌందర్యంలో గాంభీర్యం వుండాలి. ఇదంతా పెద్ద డైరెక్షన్!...ఏమనుకున్నావో.

సెమిట్స్యేవిచ్—ఆ! తెలిసింది. పనిమూలంగా వాడిపోయిన మొహం.

రైజోవు—ఔనౌను! నువ్వుమార్క్సిస్టువి కాకపోతేనేం గాక, నా అభిప్రాయం చులాగ్గా కనుక్కున్నావు!

సెమ్‌ట్స్యేవిచ్—పెద్దపెద్ద ముడతలు......

రైజోవు—(సందేహిస్తూ) ఔను...కాని...

సెమెట్స్యేవిచ్—పుల్లలమాదిరి చేతులు......

రైజోవు—అవీ!

సెమెట్స్యేవిచ్—గుండెలు...

ఇంగా—రోమన్ ఫాగింట్స్యేవిచ్! వదులుదూబాబూ?

(మీరా పకపక నవ్వుతుంది. సెమ్ట్సోవిచ్ కూడా రైజోవు మొగం మీద నే నవ్వి అతని భుజంమీద చెయ్యి వేస్తాడు. అందరూ నవ్వుతారు. రైజోవు తన్నే తాటాకులు కట్టేరని గుర్తించలేక తానూ నవ్వుతాడు.)

మీరా—ఓరి!...నీతర్కం!

రైజోవు—(ముందు గాంభీర్యం చూపి, అంతలో నీళ్ళుకారి పోతాడు.) ఇదా నువ్వు చేసేది. రోమన్! మీరంతా వొక్కటే. సరే. సరే. జ్ఞాపకంవుంచుకో. (ద్వారం కేసి నడుస్తాడు.)

సెమెట్సోవిచ్—ఇగ్నట్! హాస్యానికి అన్నానోయి! ఇగ్నట్ (అతని వెంట వెడతాడు!)

ఇంగా—డానిలిచ్! అభినందనం. ఇప్పుడే టర్కుసువాళ్ళు ఫోను చేసేరు. మనకి మిషన్లువస్తూన్నాయి. లైసెన్సుకోసం బయలుదేరేను.

సోమోవు—నిజమే? అంగీకరించేరూ?

ఇంగా—ఎంత ఎల్లా దెబ్బలాడితేను! ఏలాగయితేనేం గుంజా కొచ్చేను.

సోమోవు—దిట్టమైనదానివి. అద్భుతమైనపని చేసేవు. (భుజం తట్టుతాడు.) అభినందనం!

మీరా—ఇది గొప్పపనికాదూ? మరి అది ఆవిడని అదమాయిస్తూంటూవేం?

సోమోవు—అదమాయించాలి. అది తప్పదు!...కాని, ఈపనికి మాత్రం! అభినందనాలే...ఆపని చూసుకో...ఇంగా! వెళ్ళు. (వెడతాడు.)

మీరా—కుటుంబవ్యవహారాలెల్లా వున్నాయి? పేచీ పూచీలు లేకుండా? ఆనందంలో తేలుతూన్నావా? మునిగిపోతావా?

ఇంగా—సుఖంగానేవున్నా. నేను ఎన్నయితే కోరుకున్నానో అన్నీ 'లభించేయి...(మాట మధ్యలో ఆగుతుంది.)

మీరా—కాని...

ఇంగా—కాని?...ఔను. కొన్ని...'కాని'...వున్నాయి. నిజమే! అందులో చాలవరకు నే నెన్నడూ వూహించివుండనివే.



మీరా—నీ అభిప్రాయం ఏమిటి? స్పష్టంగా చెప్పు.

ఇంగా—తర్వాత చెప్తానులే....

(ద్వారంవేపు నడుస్తుంది. మీరా ఈలపాడుతూంది. సెమ్ట్సోవిచ్ ద్వారంలోంచి తొంగిచూస్తాడు.)

సెమ్ట్సోవిచ్—ఇంగా! నువ్వావస్తూన్నావా?

ఇంగా—ఊఁ.

సెమ్ట్సోవిచ్—నీ నమూనాలమూలంగా చంపేసేవు నన్ను.

ఇంగా—సౌందర్యం విప్లవవ్యతిరేకం కాదని నిరూపించవలసి రావడం అంత కుదతెలివితక్కువ మరొకటిలేదు. ఎంతో మనోదార్ఢ్యం వుంటేగాని నెగ్గుకురావడం కష్టం.

(డిమిట్రీ వస్తాడు. ఉద్రేకంతోనూ, ముటముటలాడుతూనూ వుంటాడు.)

సెమ్ట్సోవిచ్—నువు నాయికా శిరోమణివి.

ఇంగా—కథలలో నాయికనా?

సెమెట్సోవిచ్—కాదు...ఓపెరాలలోని నాయికవు. నిన్ను 'బ్రక్ హిల్డ్" తో పోల్చవచ్చు.

ఇంగా—ఐతే నిన్ను? గంథర్ తోనా?

సెమ్ట్సోవిచ్...అబ్బెబ్బే! సీజ్ ఫ్రీడ్ తో

ఇంగా—ఐతే నీకు భయం వెయ్యదూ?

సెమ్ట్సోవిచ్—(విలాసంగా) ఎలా తెలుస్తుంది?

డిమిట్రీ—ఇదిగో ఇద్దరూ...ఈపాటికి చాలించండి. ఇప్పటికే నలుగురూ వేలుపెట్టి చూపుతూన్నారు. చాలు చాలు.

(నిశ్శబ్దం. ఆశ్చర్యంతో ఇంగా కనుబొమ్మ లెత్తుతుంది.)

మీరా—మిట్యా! ఏమిటోయ్ సంగతి?

ఇంగా—(ఖండితంగా) రోమన్ ఫార్పింట్సోవిచ్! పోదాం నడు.

డిమిట్రీ—(ఇంగాతో) నీతో మాట్లాడాలి.

ఇంగా—ఇప్పుడు కాదు. ట్రస్టు ఆఫీసుకి పోవాలి.

డిమిట్రీ—ఇంగా!

ఇంగా—ఏమిటి సంగతి?

డిమిట్రీ—ఒక్క క్షణం ఆగలేవు? ఇతరులతో మాటలాడడానికైతే గంటలు గడిచినా గుర్తు రాదేం?

ఇంగా—ఇతరులు నాతో ఈలాగ మాట్లాడరు!

డిమిట్రీ—నీతో ఏలా మాటాడాలంటావో కూడా చెప్పరాదూ? ఐనా ఏముందిలే - నాలో విశేషం? కాలేజీల్లో చదివిన వాడినా? నువ్వు మీ తండ్రితో విదేశాలలోవున్నప్పుడు మాతండ్రి సైబీరియాలోవున్నాడు. ఏడోయేటనుంచీ ఇల్లూ - వాకలీ లేకుండా తిరిగేను. ఐదేళ్ళపాటు దొంగల బజారులో కాలక్షేపం చేసేను. ఇన్ని గొంతులతో మాటలాడడం నేనెప్పుడూ నేర్చుకోడానికి సమయం చిక్కలేదు!

నెమ్యేన్విచ్—ఇంగా! నా ఆఫీసులో నీకోసం ఎదురు చూస్తూంటాను.

(డిమిట్రీ వేపేనా చూడకుండా గంభీరంగా నడిచిపోతాడు.)

ఇంగా—మీరా!...ఏమీ అనుకోకు...ఒక్క క్షణం మాఇద్దరినీ...

మీరా—(గునుస్తూ) ఛా, మళ్ళీ పాతగోలలే. (నెమెన్యేవిచ్ వెనకనే వెళ్ళిపోతుంది.)

ఇంగా—డిమిట్రీ! ఏమిటి విషయం? ఏమిటీ తెలివి తక్కువ ప్రదర్శనా లెందుకు? ఏమిటా అనుమానాలు? నేను ఇతరులతో మాటలాడడం నువ్వు వప్పుకోనవా?

డిమిట్రీ—అందరితోమాట్లాడినట్లే మాట్లాడుతూన్నావా అతనితో.

ఇంగా...సిగ్గుసిగ్గు. అతడు మంచి అనుభవంగలవాడు. చదువుకున్నవాడూ నని గౌరవం నాకు. అంతే. అందులో తప్పేముంది?

డిమిట్రీ—నేను చదువుకున్నవాడిని కాను. నా కా వ్యవహారాలేవీ తెలియవు......



ఇంగా—డిమ్కా! ఇదంతా ఎందుకు? అతనిలో ఏవిషయం లోపంగావుందో—అదే నీలో వుండడంచేతనే నిన్ను ప్రేమిస్తూన్నానని ఎరుగుదువా?

డిమిట్రీ—నావద్దలేని గుణాలు అతనిలో వున్నాయనికూడానా?

ఇంగా—డిమిట్రీ! చాలా అవకతవకగా మాట్లాడుతూన్నావు... అన్యాయం.

డిమిట్రీ—(ఆమెని వుద్దేశించి) గ్లఫీరా నన్నెప్పుడూ ఈలాగ బాధించివుండలేదు.

ఇంగా—నేను గ్లఫీరాను కాను. ఇదివరకు స్వతంత్రంగా జీవించేను. భవిష్యత్తులో కూడా అలాగే వుండదలచుకున్నా.

డిమిట్రీ—నువ్వు ఇతరులతో వుండడం నేను సహించలేను. నన్ను దుర్మార్గు డను; అధికారం చలాయిస్తూన్నా డను. ఏమన్నాసరే... నేను నిన్నంత ప్రేమిస్తూన్నా.

ఇంగా—అది ప్రేమ అనుకుంటున్నావు...అది వట్టి మొరటుతనం. పరిశుద్ధతనిగురించి నీకంటె ఎక్కువ పట్టుదల వుంది నాకు. నాఅంతట నేను...నీతో వుండడానికి...వచ్చేను. కాని, నన్ను తాళ్ళుపెట్టి కట్టబోతూన్నావు.

డిమిట్రీ—కాని...

ఇంగా—ఏమిటి కాని...?

డిమిట్రీ—నువ్వు నన్ను విడవదలచుకుంటే...

ఇంగా—విడవదలచుకుంటే విడిచిపెట్టేస్తాను. ఇల్లాగ మతిలేనట్లుగా ప్రవర్తించేవా నేనాపనే చెయ్యదలచుకున్నాను.

(ఇంగా వెళ్ళిపోతుంది. పిడుగుమొత్తినవాడిలా డిమిట్రీ నిలబడిపోతాడు. సోమోవు ప్రవేశిస్తాడు.)

సోమోవు—ఓ డిమిట్రీ! హల్లో! మూడో డిపార్టుమెంటుయొక్క ట్రేడ్ యూనియన్ బ్యూరోలో పరిస్థితు లెల్లా వున్నాయి? పని జరుగుతూందా?

డిమిత్రీ—ఏమీ బాగాలేదు. డానిలిచ్!...ఏమీ బాగాలేదు.

సోమోవు—(కంగారుగా) ఏంవొచ్చిందేం?

డిమిత్రీ—ఇంగాకీ నాకూ...ఏమీ కుదరడంలేదు.

సోమోవు—హిస్! కంగారుపెట్టి చంపేసేవు! వడ్రంగిపిట్టలా ఒకే మాట పట్టుకువదలవేం—నీ స్వంతవ్యవహారాలు తప్ప మనసుకు వేరు విషయాలు పట్టవా? నీకు తెలివివచ్చే దెప్పుడు? (డిమిత్రీ వెళ్ళబోతాడు.) ఒక్క క్షణం ఆగు. ఇల్లా జరుగుతుందని నే చెప్పలేదూ? చెప్పేనా లేదా? నీసంగతి నాకు బాగా తెలుసును...గ్లఫీరాతో ఎల్లాగడిపేవు...కాని, అన్నీ...

డిమిత్రీ—అవన్నీ తవ్వుకు లాభం ఏముంది? ఇప్పుడూ సుఖంగానే గడుస్తోంది.

సోమోవు—అబద్ధం.

డిమిత్రీ—ఏమిటా అబద్ధం!

సోమోవు—సుఖంగా గడవడంలేదు. నిజానికి అసలు ఏమీ గడవడంలేదు.

డిమిత్రీ—నీ ఉద్దేశ్యం నాకు అర్థంకాలేదు.

సోమోవు—నువ్వెప్పుడేనా ఆమె విషయం కనుక్కున్నావా? ఏలా రోజులు గడుపుతూందో తెలుసుకున్నావా? ఆమె కెప్పుడేనా సాయంచేసేవా? నీతో సమానంగా అభివృద్ధిలోకి తెచ్చుకుందు కెన్నడేనా ప్రయత్నించేవా?

డిమిత్రీ—నాబుర్ర ఏమీ బాగాలేదు. డానిలిచ్! నాజీవితంలో ఎన్నడూ యుద్ధరంగంలో వున్నప్పుడూ—వుద్యోగంలో వున్నప్పుడూ కూడా ఎన్నడూ...ఈవేళ నున్నంత విసుగుపడలేదు. ఎప్పుడూ! ఇంగాకి నా సర్వస్వం అర్పించేను.

సోమోవు—నిజమే...కాని గ్లఫీరా మాటేమిటి?



డిమిత్రీ—అదే వున్న బాధ అంతా. పదకొండేళ్ళు...తుడిచేస్తే పోయే విషయంకాదు. నాకూ—ఆమెకూ అలా పొందిక కుదిరిపోయింది ...తరవాత వాల్కా పుట్టింది. అంతే ఆఖరు. ఇంక వాళ్ళతో వుండడం... బురదలో కూరుకుపోవడమే. అంతే...

సోమోవు—అందులోంచి బయట కూడిపడడానికి తన్నుకులాడుతూన్నావని నాకు తెలుసును కాని, నువ్వు చెప్పేవన్నీ అబద్ధాలు. ఆమెని అభివృద్ధిలోనికి తేవడానికి నువ్వేమీ ప్రయత్నించలేదు. ఆసంగతి నీకూ తెలుసును. మన తప్పులు మరొకళ్ళ నెత్తిన రుద్దడం అంత సులువైన పని ప్రపంచంలో లేదు. (వెక్కిరింతగా) నేనుఅభివృద్ధిపొందాలి. కనపడ్డంలేదూ! దారి కడ్డుగా నిలబడ్డావు!......

డిమిత్రీ—అడ్డుగావున్నప్పుడేం చేయాలి?

సోమోవు! అడ్డులేదుగా! నువ్వు చెప్పేది పచ్చి అబద్ధం! ఆమె అడ్డం కాలేదనే సంగతి నువ్వే ఎరుగుదువు. అబ్బాయి! మనలో లోపాలు కప్పి పుచ్చుకోవడానికి ఏదో మార్పువచ్చి తీరవలసిన అగత్యం ఏర్పడిందని చెప్పబోకు.

డిమిత్రీ—లోపాలు ఏమిటి?

సోమోవు—నాకే కన్ను కప్పబోకు! నీ మనస్సులోని సంగతులన్నీ నేనూ ఎరుగుదును. ప్రతిష్ఠకోసం _ పదవికోసమూను . ఈపాకులాట... పేరుకోసం! వట్టిమూర్ఖత్వం! పెద్దఆశ పడ్డావు. పేరుపడ్డవాని కూతురు!... చదువుకుంది!—రూపసి!...కళ్లు జిగాల్మని పోయినాయి పాపం!...యూరోపు తిరిగివచ్చింది!...ఇవీ నిన్ను ఆకర్షించినవిషయాలు.

డిమిత్రీ—డానిలిచ్! ఈపాటికి కట్టిపెట్టు. ప్రతిష్ఠకీ దీనికీ సంబంధం ఏమిటి? వీటివేటికోసమూ నే నామెను ప్రేమించలేదు. ఆవిడ నా కామ్రేడ్. నా మాటల్ని, నాభావాల్ని అర్థం చేసుకోగలదు. మాటలలో చెప్పలేకుండావున్నాను. ఆ విషయాలు, నువ్వు ఊహించుకోవలసిందే. కాని, గ్లఫీరా? హూ! (భుజాలు కుదుపుకుంటాడు.)

సోమోవు—గ్లఫీరా! మనం ఇప్పుడు గ్లఫీరాని గురించి మాటలాడు కోవడంలేదు. ఆవిడతో సంబంధాలు తెంచివేసుకున్నావు నువ్వు. నీ సంగతే చెప్పుకో. ఇప్పుడు నువ్వు చేస్తూన్న పని ఏమిటి? ఫ్యాక్టరీకమిటీకి ఛైర్మనువు ఐవుండి, స్వంతవ్యవహారాలతో మునిగిపోయి, వేలుపెట్టి చూపించుకోనేలా తయారయేవా? స్నేహం ఒకఎత్తు. పని మరోఎత్తూ. నువ్వు ఏంచేస్తూన్నట్లు? కేట్లవిషయం ఆమెకి వదిలిపెట్టేవు. వెంటిలేటర్ల విషయం ఆవిడకివదిలేసేవు. ఇక్కడికి అయిదునెలలనుంచి అవని మొండి పడి కూర్చుండే. వెంటిలేటర్లు ఎక్కడున్నాయి? కూలిరక్షణవ్యవహారాలు ఏంచేసేవు? ఇదేనా పనిచెయ్యవలసినమార్గం? రైజోవు శిమ్యరికం మొదలు పెట్టేవా?

డిమిట్రీ—(కృంగిపోయి) డానివిచ్! ఒక్కనిముషం ఊరుకో, వదిలిపెట్టు.

సోమోవు—ఊరుకోమంటావేమిటి? నీకేచెప్తూంట. విన్నావా?

(డిమిట్రీ) చప్పున ప్రక్కకి తిరిగి ద్వారంకేసి నడుస్తాడు. గ్లఫీరా - నాస్త్యాలు అద్వారంవెంట ప్రవేశిస్తారు.)

గ్లఫీరా—కామేడ్ గుర్విచ్!...ఆమె ఇక్కడలేదూ?

సోమోవు—ఓ! ఆవిడేవచ్చింది. చెప్పు చూద్దాం. నావారులో విషయాలు ఏంజరుగుతూన్నాయో ఏమిటో? (డిమిట్రీతో) ఏం? ఆవిడ అందంగాలేదూ? ఒక్క ఏడాదిపోనియ్యి. సోవియటు ప్రతినిధిగా ఎన్ను కోబడి తీరుతుంది.

(డిమిట్రీ సమాధానం చెప్పడు. ఆతురతతోనూ, ఆనందంతోనూ గ్లఫీరావంక చూస్తుంటాడు.)

గ్లఫీరా—ఎవరినో ఒకరిని విసిగించడమే నీపని అనుకుంటానే. నీ పథ్యత్వరుసుంబాకీమాట ఏంచెప్పేవు? పిల్లలంటే మహాఅభిమానం అంటావు, చందాలమాటమాత్రం మరిచిపోతూంటావు.

సోమోవు—(కోలాహలంగా) ఓరిబాబో! ఎన్ని విషయాలని జ్ఞాపకం వుంచుకోనూ? ఏమాత్రం ఇవ్వాలి? ఆరునెలలకీకాబోలనే.....



(జేబులు తడుముకుంటాడు.) ఏడాదినుంచి ఇయ్యడం లేదంటావా? సిగ్గు - సిగ్గు! ఎవరేనావింటే......

గ్లఫీరా—మిట్యా! నన్ను చూసి పారిపోతా వెందుకు? ఈ మూడు నెలలకీ నిన్ను ముఖాముఖీని చూడడానికి ఇదే మొదటిమారు. ఊరికే మీటింగులలో కనపడడమే. ఏమేనా మనువర్తి ఇయ్యమంటావని భయ పడుతూన్నావా? నువ్వుపుచ్చుకోమని బ్రతిమలాడినా తీసుకోనని చెప్ప లేదూ? మనువర్తి లేకపోయినా వాల్యూష్కా - నేనూ సుఖంగానే రోజులు గడుపుకుంటున్నాం...నీ వ్యవహారాలేలావున్నాయి?

డిమిట్రీ—ఏమిటల్లా మాట్లాడుతావు?

గ్లఫీరా—సరే, సరే...మిట్యా! ఎంతకోపిష్టివాడివి అయిపో యేవు?...వద్దువద్దు...సరే! (సోమోవుతో) నేను నాస్త్యావ్యవహారంమీద వచ్చేను. అర్థంఅయిందా ఏమిటో. సోఫ్రాన్ చంపేస్తున్నాడు ఏవిధం. గానూ ఊరుకోబెట్టడం సాధ్యం కావడంలేదు.

సోమోవు—త్రాగి, కొడుతూన్నాడా?

నాస్త్యా—చేతికి అందిన దానితోటల్లా! కుంపటి!.....కుర్చీ!... ఒళ్ళంతా కాయలుకాచిపోయింది. ఆదెబ్బలుతిని, ఇంకా ఏలా జీవించి వుంటున్నానో నాకే ఆశ్చర్యంగావుంది.

గ్లఫీరా—ప్రతిరాత్రీ! ప్రతిరాత్రీ అంతే! పనిలోంచి తిన్నగా బిర్ - హాల్‌కి వెడతాడు. రాత్రి పదింటికి వస్తాడు. (చేయివిసిరి) కొంప లంటుకున్నంత గోలచేస్తాడు.

నాస్త్యా—ఆ అల్లరికి ఇంకా కొంప కూలిపోకుండా ఏలావుందో కూడా ఆశ్చర్యం!

సోమోవు—అయితే నువ్వెందుకు ఊరుకున్నావు? (కొంచెం ఆలో చించి) మటిబొమ్మలు!...కోర్టుకి ఈడవండి! అంతే దానికి చెయ్యవలసింది!

గ్లఫీరా—ఈవేళే ఇక్కడికితీసుకొస్తాం. వాడిసంగతికనుక్కోమరి!

సోమోవు—స్త్రీల కమిటీముందుకి లాక్కుపోండి. అదీసంగతి. మీరా వాడికి కళ్లెం తగిలించగలరు.

గ్లఫీరా—అలాగే చెయ్యమంటావా? కాని, ఒక్క అంగుళం వెనక్కి జంకేమా, ఒకమైలు గెంటివేస్తారు!

సోమోవు—(చేతులు పిసుక్కుంటూ) మిటెంకా! విన్నావూ? ఏలాంటి స్త్రీలు తయారవుతూన్నారో చూసేవూ? (గ్లఫీరా భుజాలుపట్టుకొని ప్రేమతో గుంజుతాడు.) నిజం! గ్లఫీరా! ఒక్క అంగుళంకూడా జరక్కండి. స్త్రీల హక్కులకోసం కొసకంటా పోరాడండి! (డిమిత్రీతో) నేస్తం! చూసేవు; ప్రజాసామాన్యం ఏలాగ ముందుకి వస్తోందో. ఏవిధమైన ఆర్భాటం, వేషభాషలూ కనపడవు! కాని, నిజమైన శక్తి వారిలోనేవుంది. సరేకాని, నాస్త్యా! ఆపనిచేద్దాం అంటావా? ఊం. వరాండాలో వుందేమో మీరా చూద్దాం, నడు వేగం. రా.

నాస్త్యా—ఇదిగో...(తటపటాయించి, గ్లఫీరాతో) బయటవుంటా.

(సోమోవు, నాస్త్యాలు వెడతారు.)

డిమిత్రీ—నీలో ఎంత తేడావుంది!...

గ్లఫీరా—నాలో తేడా ఏంవచ్చింది. ఎప్పటిలాగే వున్నాను... పనిచేస్తున్నాను. బాకీలు వసూలుచేస్తున్నాను...అందులో పెద్దవిశేషం ఏముంది? కాని, నాలో ధైర్యం కలిగింది.

డిమిత్రీ—నీకళ్ళు!...వెనకటి మాదిరిగానే వున్నాయంటావా?

గ్లఫీరా—ఇంకా! ఊరికే నీభ్రమ అంతే!

డిమిత్రీ—నీ పెదవులు!...ఏమైనా...మునుపటికంటె గంభీరంగా వున్నాయి!

గ్లఫీరా—మిట్కా! ఊరుకుందూ. ఏమిటా వర్ణన. పాషాణ ప్రతిమని వర్ణించినట్లు! కళ్ళు-నోరు! అంటావేమిటి? వాల్కామాట కనుక్కోవేం? మూడు నెలలనుంచి చూడలేదు కదా, ఓమాటూ జ్ఞాపకం రాలేదూ?

డిమిత్రీ—తలపుకివచ్చి నిద్రపోలేనిరాత్రులున్నాయి. నీకు ఏలా తెలుస్తుంది?

గ్లఫీరా—నేను ఒప్పుకుంటాను, అయితే నేం, వదిలిపెట్టిపోయేవు. నీకేల పుట్టింది ఆబుద్ధి!



డిమిత్రీ—వ్యవహారాలు ఈలాపరిణమిస్తాయని తెలిసివుంటే...... వెళ్ళిపోకపొయ్యేవాడిని.

గ్లఫీరా—(అతనిచేయిపట్టుకుని) ఏం, ఇబ్బంది, పడుతున్నావు కాబోలునేం?

డిమిత్రీ—(ఒక్కనిముషం ఆగి) నీదగ్గరున్నప్పుడే సుఖం అనిపిస్తోంది.

గ్లఫీరా—ఏమిటామాట! వెర్రివాడా!...సుఖంగా జీవిస్తున్నావనుకున్నా. కాని, చూసుకున్నావా, ఏలాగవున్నావో.

డిమిత్రీ—వాల్కాయే అస్తమానం మనస్సులో మెదులుతూంది.

గ్లఫీరా—నీతో ఓమాట చెప్పాలనివుంది. మిట్యా! వెనక నువ్వు ఎంతో బలంగావున్నట్లూ, పెద్దవాడివైనట్లూ తోచేది. నిన్నుచూస్తే బెదురుగావుండేది! నిజం! కాని, ఇప్పుడు ఒక్కమాటుగా ఎంతో చిన్నవాడివి అయిపోయినట్లు కనపడుతూన్నావు. నిన్నుచూస్తే జాలివేస్తోంది. వాల్కానిమాదిరిగా ఒళ్ళో పడుకోబెట్టుకొని జోకొట్టాలనిపిస్తోంది.

డిమిత్రీ—(నవ్వుతూ) నువ్వు పెద్దదానివయేవు! అందుచేతనే అలా అనిపిస్తోంది.

గ్లఫీరా—పెద్దదానినయేనూ? ఐతే నువ్వెందుకు కావడంలేదు? మిట్యా! నువ్వుకూడాఅభివృద్ధిపొందాలి. ఓమారు ఏమిటన్నావో జ్ఞాపకంవుందా? నేనెప్పటికీ నిన్ను అందుకోలేననీ, బరువులాగినట్లు ఈడవాలనీ అన్నావు...మిటెంకా! నేనూ నిన్ను అందుకోగలను. జాగ్రత్తపడకపోయేవా, నిన్ను మించిపోగలను. జీవితం అంటే ఏమిటో తెలుసుకోగలిగేను. తెలుసుకోవడమేకాదు. అది ఎక్కడెక్కడ ఏయేమార్పులు పొందుతూందో, ఏలావుంటుందో...ఉహూ!...చెప్పలేకుండావున్నా. (నవ్వుతుంది.) నామనసులోది మాటలలోకి కూర్చలేకుండావున్నా. కానీ, కొంతకాలంపోనీ, మీ ఇంగాని అందుకోవడమేకాదు. మించిపోతాం. కొద్దికొద్దిగా, చిన్నచిన్న దగ్గరకుట్లతో, మాంచిబిగువుగా కుట్టేస్తాం. వాళ్ళ

కంటె సత్తువ - దార్ఢ్యం మారుంది. నువ్వా ఎదుగుదువు. మారక్తం ఇంకా చల్లారిపోలేదు. (ఆమె కాగలించుకోపోతుంది. అతడు నవ్వుతూ వెనక్కి ఒదుగుతాడు.) నాలో ధైర్యం ఏర్పడింది. మనసులోమాట మొగంమీద చెప్పగలను. మొహమాటంపోయింది.

డిమిట్రీ—గ్లాషా! నీవంకచూస్తే, పూర్వపుదానివేనా అని అనుమానం కగిస్తున్నావు.

గ్లఫీరా—అనుమానం ఎందుకు. పూర్వపు గ్లఫీరానే.

డిమిట్రీ—ఊహుఁ కాదు. వెనకటిమనిషివి కానేకావు.

గ్లఫీరా—కాకపోవడం ఏమిటి?...బహుశా నీమాటే నిజమేమో. నేను వెనకటి మాదిరిగా లేను...

డిమిట్రీ—గ్లాషెన్‌కా?

(చేతులు చాపుకొని ఆమెవైపు నడుస్తాడు. ఇంగా గుమ్మంలోకి వచ్చి ఒక్కక్షణం ఆగుతుంది. నిశ్శబ్దం.)

ఇంగా—మీరా ఇక్కడలేదా?

(నెమ్మదిగా లోపల ప్రవేశిస్తుంది. గ్లఫీరాని ఎగాదిగా చూస్తుంది. గ్లఫీరా మొదట బిడియపడినా, అంతలో సర్దుకొని, ఇంగావంక చూస్తుంది.)

మీవంట్లో ఏలావుంది?

గ్లఫీరా—కామ్రేడ్ రిజ్జర్! ఆరోగ్యమా?

(ఇంగావేపు చేయిజాపుతుంది. మొదట అనుమానించినా ఇంగా చేయి అందుకుంటుంది.)

ఇంగా—షేక్-హ్యాండ్ పద్ధతి రద్దుచెయ్యబడిందని తెలియదు?

గ్లఫీరా—క్షమించండి!...ఎక్కడా ఏనోటీసులోనూ చూడలేదు.

ఇంగా—పనిలోంచి వచ్చేసేరేం?

డిమిట్రీ—భోజనపువేళ అయింది.

ఇంగా—(కొంచెం సంకోచంతో) బహుశా మీకు అడ్డువచ్చేనేమో ననుకుంటున్నా...



డిమిట్రీ—(ఖండితంగా) ఆలా ఎందుకు అనుకోవలసివచ్చింది?

ఇంగా—నువ్వు ఎంతో ఆవేశంతో మాట్లాడుతూన్నావు...

డిమిట్రీ—అయితేనేం? మనం ముగ్గురం కలిసే మాటలాడవచ్చును. ఒకరినిచూసి ఒకరు భయపడడమూ - అనుమానపడడమూ వదులుకుందాం.

ఇంగా—అనుమానమా?

డిమిట్రీ—ఏమిటాస్వరం?

ఇంగా—ఈమారు తంపి నాకే పెట్టేవు? డిమిట్రీ! వెకిలితనంవద్దు. పరాయివాళ్ళముందు మాటాడవలసిన పద్ధతి ఇదికాదు.

గ్లఫీరా—మరొకలా తలపకండి. నేవెడతా. (వెళ్ళబోతుంది.)

డిమిట్రీ—గ్లాషా! ఆగు.

(ఆమె భుజంమీద చెయ్యివేసి ఆపుతాడు. గ్లఫీరా వెనుతిరిగి, కంగారుగా మాట్లాడుతుంది.)

గ్లఫీరా—మన ఇద్దరిలో ఎక్కువ పరాయివాళ్ళు ఎవరంటావు? మిత్ర్యాకోసం నేను త్యాగంచేసినంతగా ఎవ్వరూ చేయలేరనుకోను. (సిగ్గుపడుతుంది.)

ఇంగా—ఎవరికి సాధ్యమైన త్యాగం వారు చేస్తారు.

డిమిట్రీ—ఏమి అనుబంధం! మూడు జీవితాలు పరస్పరం బంధింపబడ్డాయి!...ఇంగా!...మనం ఇంకోవిధంగా వ్యవహారం ఏలచక్కబెట్టుకోగూడదు? చెప్పు...ఆవిడని బాధించి మనం సుఖపడడం ఎందుకు?

గ్లఫీరా—మిటెంకా! మళ్లీ ఆసంగతి ఎత్తుకోకు! వినబడిందా?

డిమిట్రీ—ఇంగా! నువ్వు స్త్రీలోకంలో అఘనిరురాలివి. నువ్వు కూడా మాలోదానివే. అల్లాంటప్పుడు మనం ముగ్గురం విడిపోవడం ఎందుకు? ఎందుకంటావ్? దానివలన ఎవరికి లాభం? నీకా? ఆమెకా? ఎందుకు ఇదంతా?

ఇంగా—డిమిట్రీ! నీఅభిప్రాయం ఏమిటి? మనం ముగ్గురం...కలిసి వుండాలనా? నేను మరొకడితో వుండడం నువ్వు భరించలేవా? నిన్ను మరొకరితో వుండడాన్ని నేను సహించాలి? ఏమిన్యాయం?

గ్లఫీరా—మిట్యా! నన్ను... కామ్రేడ్ మేనేజర్‌కి వంటమనిషిగా చేద్దామనా? వద్దు... నమస్కారం!

ఇంగా—కలలుకనడం కట్టిపెట్టు. ఈవిధంగా సాగుతుందని మనసులోకూడా అనుకోబోకు.

గ్లఫీరా—మిట్యూషా! ఏదో ఒకటి ఒక్కసారే తేల్చివేసుకోడం మంచిది. ఏదో ఒకటి నిర్ణయించుకో. మనసులో ఊరికే కుళ్ళిపోతున్నావు.

ఇంగా—(డిమిట్రీతో) నాదగ్గరికి ఇక రాకు! వెళ్ళిపో! వింటున్నావా? ఈవ్యవహారం నాకింక వొప్పదు.

డిమిట్రీ—(ఇంచుమించు అసహ్యంతో) నేనెక్కడికీ పోను. పోలేను. నీవేదో మాయచేసేసేవు! (పరుగెత్తి పోతాడు.)

గ్లఫీరా—(తెల్లబోయి-నెమ్మదిగా) ఎంత ఏలా కుళ్ళిపోతున్నాడు?

ఇంగా—ఇంత దుర్బలుడని నేను అనుకోలేదు.

గ్లఫీరా—నాతో వున్నప్పుడెప్పుడూ దుర్బలుడుగా కనపడలేదు.

ఇంగా—కూతురుకోసం బెంగపెట్టుకున్నాడు.

గ్లఫీరా—పిల్లతో అతనికేమీ సంబంధంలేదు. ఆమె నాది. బుద్ధిపూర్వకంగా వదిలిపెట్టి, బెంగపడడం ఎందుకు? అదీగాక త్వరలో నేకనవచ్చుగా మరోబిడ్డని!

ఇంగా—(ఆమెవేపు దీర్ఘంగా చూసి) వారు బిడ్డలు కలగరు!

గ్లఫీరా—కలగరు!

(గ్లఫీరా మనసులోని సంతృప్తి సానుభూతిగా మారుతుంది. ఒక్కక్షణం ఉభయులమధ్య స్నేహం, ప్రేమా ఏర్పడినట్లు కనబడుతుంది. కాని అంతలోనే అంతరిస్తుంది. ఉభయులూ గప్‌చిప్‌గా వూరుకుంటారు.)

సరే, దానికేం! ఎవరిబాధలు వారికుంటాయి ... ఎవరి సుఖం వారిది!

(మొదటి కమ్యూనిస్టుయువతి పరుగెత్తి వస్తుంది.)



మొ॥ క॥ యువతి—గ్లాషా! నువ్విక్కడున్నావూ? (కొంచెం కంగారుగా) కామ్రేడ్ రిజర్! మీరుకూడా రారూ?

ఇంగా—ఏమిటి విశేషాలు!

మొ॥ క॥ యువతి—బోల్టికోవు తిమ్మిరి వదల్చబోతున్నాం.

గ్లఫీరా—కామ్రేడ్! సెలవు. (గంభీరంగానూ - దృఢంగానూ నడిచి వెళుతుంది.

మొ॥ క॥ యువతి—మీరుకూడా వస్తారా?

ఇంగా—ఒక్కక్షణం ఆగి.

(మొదటి కమ్యూనిస్టుయువతి పరుగెత్తిపోతుంది.)

(శూన్యదృష్టులతో చాలసేపు ఆకాశంవంక చూసి) ఉహు... అసంభవం!... పనికికూడా అడ్డంవస్తూంది... లాభంలేదు.

(తెర)

## పదకొండో రంగం.

[ఫ్యాక్టరీలోని కుట్టుపని శాఖతాలూకు విద్యామందిరంలోని 'రెడ్ కార్నర్' రెండు నల్లబల్లలు ఎదురుగా కనబడుతూంటాయి. ఒకటి ఎర్రని చట్రంలోనూ, మరొకటి నల్లని చట్రంలోనూ బిగించబడి వుంటాయి. ప్రకటన పత్రికలు - పంచవర్షప్రణాళిక తాలూకు హెచ్చరికలు, సోషలిస్టుపోటీ అంచనాలను తెలిపే అట్టలు, పుస్తకాల బీరువాలు, ఆయుధాలుంచుకొనే రాక్ (rack), మేజాలు, కుర్చీలు, వున్నాయి.

ఒక చిన్నమేజావద్ద మీరా కూర్చునివుంది. బోల్టికోవునీ-నాస్త్యానీ మీరా ఏవో ప్రశ్నించుతూంది. వారి చుట్టూ జనం మూగివున్నారు.]

బోల్టికోవు—నన్నేం చెయ్యమంటారు? నాకేం పని లేదక్కడ నేను రానని చెప్పలేదూ?

మీరా—నువ్వేమీ చేయనక్కరలేదు. ఊరికే మాట్లాడుకుందాం.

బోల్టికోవు—నీతోగాని, నీమాటలతోగాని, నాకేమీపనిలేదు. నాకింకాపనులున్నాయి. నన్ను ఆపవద్దు. భోజనానికి ఖాళీవున్నది ఒక్క అరగంట మాత్రమే. రోజంతా ఖాళీ కాదనేసంగతి మరువవద్దు.

(గ్లఫీరావస్తుంది. కొద్దిసేపటికి ఇంగావస్తుంది. గ్లఫీరా నాస్త్యావద్దకు వచ్చి ఆమె భుజంమీద చెయివేస్తుంది. నాస్త్యా ఆమెకి దగ్గరగా నిలవబడుతుంది, చాలాభయంతో)

గ్లఫీరా—ఏమందీ? బీర్-హాల్‌లోనేనా?

ఇంగా—మీరామీరా! ఏమిటిది?

మీరా—నిర్మొగమాటంగా చెప్పాలంటే విచారణ-న్యాయం!

బోల్టికోవు—ఏమిటీ?...విచారణా? నన్ను విచారణ చెయ్యడానికి మీరెవరు? మీరు తీర్పుచెప్పడం నేను...కొత్తమాట వినబడుతూంది! నా పెళ్ళాన్ని నే కొట్టుకోగూడదేం? నాయింట్లోనే నాకధికారంలేదంటారా? ఇదివరకల్లా ఆకొట్టడం నాకలవాటు. ఈవేళ హఠాత్తుగా మీరు కొట్టగూడదంటారేం?...ఇదిగో ఖచ్చితంగా చెప్తూన్నా వినండి రెండు మాటలు!

మీరా—సరే. సరే. కంగారుపడకు. మేమూ ఖచ్చితంగానే అడుగుతాం.

బోల్టికోవు—నీతో మాట్లాడవలసిన పనేలేదు. జడ్జీట హుం.

ఇంగా—నేను ట్రస్టుఆఫీసుకు వెడుతున్నా. మీరా! కొంచెం ఆలస్యం కావచ్చును. స్త్రీల కార్యక్రమానికి సంబంధించిన నా రిపోర్టును దీని తరవాతకి మార్చు. మరిచిపోకు.

మీరా—(సాలోచనగా ఆమెనూ-గ్లఫీరానూ పరీక్షగా చూసి.) సరే!...(కోపంతో) ఇంతకంటె చెయ్యగలదేముంది...ఒకరినొకరు ఏడిపించుకోడమే కా?

ప్రజలలో ధ్వనులు—ఆమెకి తీరుబడిలేదు!...ఇంకా ఎందరి ముక్కుల్ని చక్కపెట్టాలో...నమూనాల మాటమాత్రం మరచిపోలేదు నయమే!...అల్లాటి జ్ఞానమే వుంచుకుంటే ఎంతబాగుండేది!...



(ఇంగా నిలబడి, తిరగబడి, ఆమాటలాడిన వారికోసం చూస్తుంది. నిశ్శబ్దం.)

మీరా—వెళ్ళు. నీపని చూసుకో.

(ప్రజలంతా ఎంతో కోపంతో చూస్తూండగా ఇంగా వెడుతుంది, ఆమె కనుమరుగైనాక మామూలుగా సంభాషణ సాగుతుంది.)

ప్రజలు—వారంతా మంచివక్తలు!...చురుకైన వాళ్ళును!...వ్యవహారం!

మీరా—సరే. కానీండి. మనపని చూసుకుందాం. (మేజా కొసవానుకుని కూర్చుంటుంది.) ప్రారంభిద్దాం! అతడు త్రాగుతాడు...ఇది అందరూ ఎరిగిన సంగతే!

ప్రజలు—ఔను. అయితేనేం? మగాడికది తప్పుకాదే!

నాస్త్యా—(గ్లఫీరాని అనుకుని) కామ్రేడ్స్! ఆత్రాగుడికి అంతంలేదు. అవడం అంటూలేదు. ఇతరులుపనిలోంచి ఇంటి కొస్తూంటే, ఆయనగారు బీర్-హాల్‌కి నడుస్తాడు. తెగత్రాగి, ఒళ్ళు తెలియకుండావచ్చి పడతాడు. విచారించండి.

గ్లఫీరా—మెట్లపైకి-క్రిందికీ పిడుగులుపడ్డట్లు, ఉరకలువేస్తాడు. ఎవ్వరిఎడలా, ఏవిషయంలోనూ లక్ష్యంవుంచడు. రోగిష్ఠివాళ్ళుంటారు!...నిద్రపోతూన్నవాళ్ళుంటారు!...పిల్లలుంటారు!....ఆతేమీ అతడికి పట్టవు. తెగఅరుస్తాడు. బొబ్బలుపెడతాడు...ఎందుకయ్యా.ఆ అరుపులూ, బొబ్బలూ?

బోల్టికోవు—(వాతావరణంలోని గాంభీర్యానికి కృంగిపోయి.) నేనెప్పుడూ అరవలేదు. పాడుకుంటా.

నా—పాటలేమిటి?...పచ్చిబూతులు!

(శివ గొంతుక్కి తానే చెదిరి; గ్లఫీరా వెనక వొదుగుతుంది.)

బోల్టికోవు—నీ...

ఒకముసలి స్త్రీ — అయితేనేం? తాగినా, బాదినా, పెళ్ళాన్ని విడిచిపెట్టిపోలేముగదా?

బోల్ట్రికోవు — నిజం! అమ్మాయిలూ! నేను తాగవచ్చు, దెబ్బలాడవచ్చు......

నా — (ఏడుస్తూ) వట్టి రౌడీవి!

బోల్లికోవు — కావచ్చు, కాని, వెధవకోతిపనులు చేసేరకంమాత్రం కాదు. ఊం. నాపని ఐతే పోతా.

మీరా — ఆగు. ఏం, ఇదేం, నీయిల్లనుకున్నావా?

గ్లఫీరా — ఎక్కడున్నాననుకుంటున్నావు?.... కల్లుపాక అనుకున్నావా?

బోల్ట్రికోవు — ఏమిటి బీర్ - హాల్ - బీర్ - హాల్ అని పట్టుకున్నారు? నా ఏడోఏటనుంచీ నేను తాగుతూన్నా. అదిగాక, నేచేసే పని అలాంటిది. తాగక - ఏం చేస్తావు? మీరేమయినా నా తాగుడికి డబ్బు ఇస్తూన్నారా? నాస్వంత సొమ్ము ఖర్చుచేసుకుంటున్నాను! ఏమిటి తెగవాగుతారు? కామ్రేడ్స్!... నేనెల్లాంటివాణ్ణో మీకేం తెలుసు? మూడేళ్ళపాటు యుద్ధరంగంలో, అన్నిరకాల తుపాకులూ రైఫిళ్ళతో - రష్యను - జర్మను - జపాను ఫిరంగులు పుచ్చుకొని పోరాడేను. జారిజం మీదా - బూర్జువాలమీదా బాగా యుద్ధం సాగించిన వాళ్ళలో ఒకణ్ణి. ఇప్పుడు నానాతుక్కురకమూ... అడ్డమైనవాళ్ళూ... ఎందుకూ పనికిరాని ఆడంగిమేళం... అధికారాల్లోకి వచ్చేరు. పెద్ద, మేమమ్మా పాక్ - బ్రిగేడ్లమంటూ? అక్కడ నేనుమాత్రం ఏటిపొడుగునా, చెమటలు కక్కుకుంటూ, ఇనపకమ్మలతో గింజుకుంటూన్నానూ? ఇతరులకోసం నేను చాకిరీ చేయడమూ, ఆఖరికి నాకు గుడ్డలూ - జోళ్ళూ కరవైపోవడమూనా? (అతని కంఠం స్తంభిస్తుంది! నాస్త్యా ఎంతో జాలితో అతనివేపు చూస్తూ ఏడ్పు మొదలెడుతుంది.) పైగా ఈకంగాళీమూక నాకు పేర్లు పెట్టడమూ? తాగుబోతా!... పెళ్ళాన్ని కొడతాడూ!... మీ.... ఇందుకా నే యుద్ధం



చేస్తి? ఆడవాళ్ళకి చేతులు జోడించడానికా? ఇందుకేనా నే బాధలు పడ్డది? ఈమాదిరి ఫలితంకోసం ఎవ్వడేనా ప్రయత్నించుతాడా? (ఎవరైనా సానుభూతిచూపుతారేమోనని చుట్టూ చూస్తాడు.) ఛూ! అంతా ఆడపటాలం! మానవమాత్రుడంటూ లేడు.

మీరా — ఈవ్యవహారానికీ నీమాటలకీ సంబంధంలేదు నీ పెళ్ళాన్ని ఎందుకు బాధించేవు?

బోల్ట్రికోవు — బాధించేనూ?... ఎవరు చెప్పేరు?... అదే?

గ్లఫీరా — లేదూ?

బోల్ట్రికోవు — బాధించేనూ?... నేనా?... నాజీవితంలో ఎన్నడూ లేదు!

గ్లఫీరా — ఎప్పుడూ లేదూ?

బోల్ట్రికోవు — కొట్టేనన్నావు. నిజం! కొట్టేను. పేనులా - దీనిని బాదకపోతే వింటుందీ? కాని, బాధించేనన్నావే. అబద్ధం! నేనేం చవటననుకున్నావా? — రాక్షసుడిననుకున్నావా?

నా — ఈమాటమాత్రం నిజం!

(నోరు మూసుకు వూరుకోమని గ్లఫీరా మోచేతితో నాస్త్యాని పొడుస్తుంది.)

బోల్ట్రికోవు — సిగ్గుమాలినముండా! నిన్ను బాధించేనటే! నేను?

నా — లేదు. సోఫ్రాన్!... వట్టిబాదడమే!

మీరా — ఆ రెండింటికీ తేడా ఏమిటో చెబుదూ వ్రాసుకుంటాను.

(నోట్ - బుక్‌లో వ్రాసుకుంటుంది.)

బోల్ట్రికోవు — ఏమిటి వ్రాస్తూన్నావు?

మీరా — తొందరపడకు. నీకు చూపిస్తాం. అప్పుడు తెలుస్తుంది నీ పెళ్ళాంకూడా మనుష్యమాత్రురాలేననే సంగతి.

బోల్ట్రికోవు — (కోపంతో) ఈమానవురాలిని జుట్టుపుచ్చుకొని కొంపకి లాక్కుపోయి, బెత్తంతో అనవసర ప్రసంగాలకి దిగకుండా బుద్ధి

చెప్తా మొగుడిమీద ఫిర్యాదుచేస్తుందీ?...ఆడాళ్ళ డిపార్టుమెంటులో దీని కిప్పుడేం వ్యవహారం వచ్చిందో!...(నాస్త్యాతో) నడు! ఇంటికి నడు! ఊఁ!

నా—సోఫ్రాన్!

బోల్టికోవు—నడు! పదహారేళ్ళనుంచి లేని నోరు ఈవేళ లేచిందీ? మేకలా తెగఅరుస్తున్నావు! ఇంక ఇల్లాంటి మాటలకి వచ్చేవంటే పీక నులిమివేస్తా.

మీరా—చాలించు! నోరుముయ్యి! ఆగు!

గ్లఫీరా—చూడండి!...అయ్యగంతులు!

బోల్టికోవు—నాస్త్యా! వెడతావా? నన్ను మళ్ళీ నోరుచేసుకోమంటావా?

గ్లఫీరా—వెళ్ళకు. నాస్త్యా! లొంగిపోయేవా. ఇంక నీతో ఎప్పుడూ మాట్లాడేదిలేదు.

బోల్టికోవు—అదీవ్యవహారం!

నా—నికిటిచ్!

గ్లఫీరా—తెలివితక్కువ చూపకు. నాస్త్యా!

నా—(అక్కడున్న స్త్రీలని ప్రార్థించుతూన్నట్లు) ...నలుగురు పిల్లలు...

బోల్టికోవు—ఇది ఒకకోర్టా? నువ్వు పిర్యాదుచేసేవా?

గ్లఫీరా—ఔను. (కొంచెం కంగారుగా) ఆవిడచేస్తుంది.

బోల్టికోవు—అనవసరంగా రాకు. నీమాట ఏమీలేదు.

మీరా—ఆమెనే మాట్లాడనియ్యి!

గ్లఫీరా—సరే. నాస్త్యా!

బోల్టికోవు—ఏం. దానికి నోరులేదా?

నా—ఓరిదేవుడా! సోఫ్రాన్! ఇంక ఆమాట తలపెట్టను. బుద్ధి వచ్చింది. క్షమించు...ఈఆడవాళ్ళంతా నామనసు విరిచేసేరు.



గ్లఫీరా—నాస్త్యా! ఏమిటి చెప్తున్నావో ఎరుగుదువా?

మీరా—మీకోసం పనిచెయ్యడం అసంభవం. మీరు ఆడవాళ్ళు కారు...ఆదేవుడికే తెలియాలి మీరెవరో? జిగురుకాగితం మీది ఈగలు!

నా—గ్లఫీరా! కోపగించకు. ఊరికే నేవచ్చి నీవద్ద చెప్పుకున్నా. దీనివలన ఏదో పనిజరుగుతుందని వూహించేను ...చూస్తూన్నావుకదా?... నేనింక ఆతనితో వేగలేను. గడ్డిపరకను వొంచేసినట్లు నన్ను వొంచేసేను. నాబలం అంతా పీల్చేసేడు. వాడితో కాపురం చేసేకన్న కఠినవరకం అనుభవించడం సుఖం. కాని, ఈపిల్లలతో ఎక్కడికిపోను? మీరు పసుచువాళ్ళు. ఈబాదరబందీలేదు. ఎక్కడున్నా బాధలేదు. కాని, నేను... ఈఇనపముంగ్రింద నలిగి చావవలసినదానినే...(ఏడుస్తుంది.)

మీరా—వెర్రిదానా! మేము ఆతనిసంగతి కనుక్కుంటాం.

గ్లఫీరా—(అడ్డుతగిలి) మేము...(హఠాత్తుగా కంగారుపడి) వాళ్ళ రెక్కలు కట్టేస్తాం. అతి జాగ్రత్తగా మళ్ళీ కదలలేకుండా—

బోల్టికోవు—చాలునులే! కట్టేవు! ... మొగుడు వదలిన దానివి నువ్వేనా?

మీరా—అయితే మళ్ళీ ఆరంభించేవన్నమాట. నువ్వు ఉన్న దెక్కడో తెలుసునా?

బోల్టికోవు—ఎక్కడున్నమాటేమిటి? ... నేనేకాదు. అందరూ ఎరుగుదురు. ఐదోనెంబరు కాలలో!

మీరా—ఏదేశంలోను? ఏమిటి గనమాయించబోతావు. నీసంగతి బహువికటంగావుందే.

మొ॥ క॥ యువతి—వినాశకుడు!

ధ్వనులు: పీడిమొహంమండా! ... తరమండి!...బయటికితరమండి! ...అన్నీ తగలేస్తాడు! సోమరిసుపోటీ వీడుంటేసాగదు! ... ...దుష్టకప్పలా!...కుక్కనొడుగు!

రెండో॥ క॥ యువతి—బ్లాక్-లిస్టులో పెటండి!

ధ్వనులు: బ్లాక్-లిస్ట్! బ్లాక్-లిస్ట్!!

మొ॥ క॥ యువతి—అంతే!

(నల్లచట్రం కట్టిన నల్లబల్లమీద బోల్ట్రకోవు పేరు వ్రాస్తుంది.)

మీరా—కోర్టులో చెప్తా ఈతడికి మంచిపాఠం! చూస్తూండండి! మీటింగు వాయిదావేసేను.

(తనకాగితాలు పోగుచేసుకొని వెళుతుంది. స్త్రీపనివారంతా బోల్ట్రకోవును) చుట్టుముట్టుతారు.)

గ్లఫీరా—(బోల్ట్రకోవుతో) ఎందుకు ఆడవాళ్ళని చూసినవ్వుతావు? ...విశేషం ఏముందీ? ఎందుకు పళ్ళు ఇగిలిస్తావు? ఒకమనిషి జీవితాన్నే నాశనంచేసి, చేసినప్రజ్ఞకి గర్వపడుతూన్నావు. నిజానికి అది గర్వపడవలసినపనికాదు. వదిలివెయ్యబడ్డానూ? లేదు. మీకళ్ళలో మేము చిరిగిన సంచులకంటేనూ అధమం! పాపం. నీమట్టుకి నీముసిలిసంచిని ఇంకా పారెయ్యలేదు. ఆడది విషం పుచ్చుకోనీ – పీకకోసికోనీ...దానితో నీకేమీ సంబంధంలేదు. అమ్మాయిలూ! వినండి! మీకే! మనం పోవలసినమార్గం స్పష్టంగా తెలుస్తూంది. నేచెప్పేది తెలుస్తూందీ? సుఖజీవితానికి మనం చేసే ప్రయత్నాలకి అడ్డంవచ్చే ప్రతివిషయంతోనూ మనం పోరాడుతాం. ఈకుండలు - అంటగిన్నెలు - ఈమాదిరి పశువులకీ స్వస్తి చెబుదాం. మిమ్మల్ని తరిమేస్తాం. పుస్తకాలలో అన్నీ వ్రాసేరులే. అన్నింటికీ చట్టాలున్నాయి. వాటిని బయటికి తెస్తాంకాదూ? ఆమాత్రం శక్తి కలిగింది మాలో. మమ్మల్ని వెనక్కి తరమడం మీతరంకాదు.

(గంటమ్రోగుతుంది. అందరూలేస్తారు. పరుగెత్తిపోయే బోల్ట్రకోవును చూసి కొందరు గేలిచేస్తారు. మరికొందరు కూతగోడతారు. పనివారు తమ స్థానాలకి చేరుకుంటారు.)

మీబోటివాళ్ళరోజులు దగ్గరపడ్డాయి. ఒకొక్కరోజు గడుస్తూంటే, మిమ్మన్నమీద కుట్టే ప్రతికుట్టూ మీజీవితాన్ని కడకితెస్తూంది. చచ్చేరు! పంచవర్షప్రణాళిక అఖరుకి మీపనికూడా అఖరవుతుంది. (గోల, పాటలు, హర్షధ్వని, కేకలు అంతా పనిలోకి పడతాయి.)

(తెర)



# నాలుగో అంకం.

## పన్నెండో రంగం.

ఫ్యాక్టరీ అసిస్టెంటు మేనేజరు కామ్రేడ్ రైజోవుయొక్క ఆఫీసు గది. పెద్దఅలంకారాలేవీలేవు. అవసరమైనవి లేకపోలేదు. ఒక్కఫైలు, వ్రాతసొరుగు, కుర్చీలు, అట్టలు, ఫోటోలు, ఎడమచేతివేపుగావుంటుంది ద్వారం. ఆద్వారంకేసీ, ప్రజలకేసీ, వీపు తిప్పి కొత్తమాదిరి దుస్తులతో అలంకరించిన ఆడబొమ్మ కూర్చుండపెట్టబడివుంది. గదిలో మరెవ్వరూ లేరు. వెరోనికా ద్వారంలోంచి తొంగిచూస్తుంది.)

వెరోనికా—రావచ్చా! (ప్రవేశిస్తుంది.) ఎవ్వరూలేరే? (బొమ్మని చూస్తుంది.) క్షమించండి! కామ్రేడ్ రైజోవు ఎక్కడుంటాడో కొంచెం చెప్తారా? (ఆగుతుంది.) క్షమించండి. (ఒక్కనిముషం ఆగి, జాగ్రత్తగా అడుగులువేసుకుంటూ బొమ్మదగ్గరకు వస్తుంది.) అమ్మా! మీరు...(భుజం తట్టి) ఓ...(ముఖంవంక చూసి వెనక్కి తగ్గుతుంది.) ఓరినాయనా! ప్రాణాలు ఎగిరిపోయినాయి!

(పెదవిమీద వేలుపెట్టుకొని వింటుంది. వెంటనే మరొకమూల నున్న కుర్చీలో కదలకుండా, గంభీరంగా చదికిలబడుతుంది. అడుగుల చప్పుడు వినబడుతుంది. మొగం ముడుచుకొని రైజోవు ప్రవేశిస్తాడు. రెండు స్త్రీవిగ్రహాల్ని చూసి ఒక్కక్షణం నిలబడతాడు. మళ్ళా కుతూహలం కలిగి విగ్రహాలముందుకు వచ్చి ముందు బొమ్మవంక చూస్తాడు. కోపంతో దాని మెడ వెనక్కితిప్పి వెరోనికా మెడకూడా తిప్పడానికి ఇటువస్తాడు.)...ఎంతసిగ్గుమాలినపని?

రైజోవు—క్షమించండి! తమరా?

వెరోనికా—ఇగ్నట్ ఇవానిచ్! ఏమి అలావున్నారేం? (వెనక్కి తిరిగిన బొమ్మతలచూసి) అదేమిట అలాచేసేరు?

రైజోవ్—ఈ భండారం అంతా ఎవరు తెచ్చేరు? ఎవరు? ఇదంతా ఇంగా పని. దీని తలతరగా? (కోపంతో గంట వాయిస్తాడు.) మిమ్మల్ని కూడా బొమ్మ అనే అనుకున్నా.

వెరోనికా—థాంక్స్!...మిమ్మల్ని చూస్తే ఆనందం కలుగుతూంది ...ఇదేనా అప్రఖ్యాతిచెందిన నమూనాల బొమ్మ. (బొమ్మకి వున్న దుస్తులు ముట్టుకుని పరీక్షిస్తుంది.) నమూనా పరీక్షించే సమయానికి నేను కూడా వుండవచ్చునేమో అడగడానికి వచ్చేను. నామట్టుకి మంచి అందంగా కనపడే పూర్వపుబానీ దీనిలో కనపడడంలేదు. ఏమంటారు? అదీకాక రమ్మంటేమాత్రం ఏలావస్తుంది? సరియైన బానీ కావలసిన వారెవరున్నారు? కట్టుకొనే దెక్కడ? కట్టుకుంటే చూసేవారెవరు? (కళ్ళు తేలేసి) ఫ్రాన్స్!...ఆ సెలూన్సు! ఊరేగింపులు! వినోదాలు! కేఫ్_డీ_ఫోయ్...అదీ విప్లవం అంటే! ఇక్కడేముందీ? అంతా క్షణికసౌందర్యం! ఉద్రేకం కలిగించే ఘట్టాలూ - ఉద్రేకంగల మానవులూ కూడా లేరు.

రైజోవ్—క్షమించండి...రాత్రంతా నిద్రలేదు...ఏదో పరిపోయింది. (బల్లవద్దకూర్చుని కాగితాలు తిరగవేస్తాడు.)

వెరోనికా—ఇబ్బందిపడకండి. వెడుతున్నా. (బొమ్మ పరీక్షిస్తుంది.) చూసేరూ. ఈ 'లైన్' చాలాబాగుంది. కాని, ఇక్కడ, మరోకలావుంటే బాగుంటుంది. (చూపిస్తూ) ఈకత్తిరింపుఇక్కడినుంచి... ఇల్లా...

రైజోవ్—(తలఎత్తి) ఏమిటది?

వెరోనికా—చూడండి!...ఈలాగ...ఇక్కడి...

రైజోవ్—విదేశాలలో బానీ కేవలం వేరు.

వెరోనికా—ఏలావుంటుందేం. (కులుకుతూ అతని దగ్గరకు వస్తుంది)

రైజోవ్—చూపిస్తావుండండి...ఇదిగో ఇటనుండి...ఈమీదుగా (వెరోనికా దుస్తులపైననే చూపుతాడు.)



వెరోనికా—ఇగ్నట్! నాకు చెడ్డ కిచకిచలు! ఆగండి! ఇదేం ఇల్లనుకుంటున్నారేం.

రైజోవ్—అబ్బే! నేనేమీ చెయ్యను. ఊరికే చూపిస్తూన్నాను. అంతే.

వెరోనికా—మీరు అసాధ్యులే. మీరు శ్రామికుల తరగతికి చెందినవారైనందుకు నాకెంతో అభిమానం, ఎరుగుదురో, ఎరగరో కాని, ఊ. చూపించండి...ఎక్కడినుంచి?...కిచకిచలు మాత్రం పెట్టకండి!

(సెమ్ట్సోవిచ్ ప్రవేశించి అంతా చూస్తాడు. రైజోవ్ సలహాగా చూపుతూంటాడు.)

రైజోవ్—ఇక్కడినుంచి...

వెరోనికా—నిజం? ఇంకా?

రైజోవ్—మరి...

వెరోనికా—ఇంకా...చెప్పండి...చెప్పండి...

రైజోవ్—మరి ..

సెమ్ట్సోవిచ్—ఇంకా ఏమూలకి తియ్యాలి. (నిశ్శబ్దం)

వెరోనికా—ఓ. రోమాట్కా! నీకోసమే వచ్చేను!

(కేకిలి నవ్వుతో సెమ్ట్సోవిచ్ వద్దకు వస్తుంది. అతడు ఆమెవేపేనా చూడడు.)

సెమ్ట్సోవిచ్—ఇగ్నట్! నీతో ఓమాట చెప్పాలి.

రైజోవ్—రోమన్ ఫ్రాంట్సోవిచ్!

సెమ్ట్సోవిచ్—నాకు చూస్తే ఆశ్చర్యంగావుంది. ఏమంటావా?... వెరోనికా పడుచుపిల్లకాదుగా...

వెరోనికా—రోమన్...ఏమిటా మాటాలు?...

సెమ్ట్సోవిచ్—(ఇంకా రైజోవుతోనే) నీశ్రామికవర్గ సౌందర్యం ఎప్పుటు వదిలేసేవు? ఎంత శ్రమపడ్డా ఆమెలో శ్రామిక చిహ్నాలు కనుక్కోలేవు సొబగు దిద్దేవాని శ్రమఫలితాలు తప్ప...

రైజోవు—రోమన్ ఫ్రాన్ట్సేవిచ్!

సెమ్‌ట్సేవిచ్—పోలిక చూద్దామన్నా మనిషిలో అన్నిముడతలూ కనబడవు.

వెరోనికా—(కాలుతాటించి) శకునపక్షీ! తుంటరీ! పిశాచం! నిన్ను చూస్తే అసహ్యం! విన్నావూ? నీతోవుండేకన్న ఎవరితోనేనా లేచిపోవడంసుఖం.

సెమ్‌ట్సేవిచ్—నీ తిరుగుళ్ళనిగురించి బాధపడడం మాని అప్పుడే పదేళ్ళుపైన గడిచింది.

రైజోవు—దేవుడితోడు. పొరపడ్డావు.

వెరోనికా—కట్టుకున్న పెళ్ళాన్ని ఇల్లా అవమానించడం ఏం న్యాయం? ఎవడో పరాయివాడు నీకళ్ళముందర నన్నుగురించి అసభ్యంగా వేలుపెట్టి చూడడం - మాట్లాడడం...మానభంగం.

రైజోవు—వెరోనికా! అన్యాయం! చాల దూరం పోతున్నాయి నీమాటలు!

సెమ్‌ట్సేవిచ్—వెరోనికా! వెళ్ళిపో. చాలాపనుంది.

వెరోనికా—నన్ను గెంటెయ్యలేవు. ఇంత ఇల్లా అవమానం చేయనియ్యను. ఏదేనాపనిచేస్తానంటే పనిచూపించవెందుచేత? నీ ఇంగా కంటేనూ పనికిమాలినదాననా? ఆమెలాగే నేనూ సమాజంలో గౌరవంగల ఒక సభ్యురాలిని. అదే ఆడదానిని. నేను కూడా రాజకీయప్రథమపాఠ పుస్తకం కొని కంఠతాపడతా. మీ మాటలన్నీ వల్లెవేసి, ఇంగాలాగే తయారవుతాను. తప్పదు! తప్పదు! తప్పదు! అప్పుడు నా వెనకాల నువ్వే తిరుగుతావు.

సెమ్‌ట్సేవిచ్—ముద్దుకుమ్మా!...చెప్పినమాట విని...ఇంటికెళ్ళు.

వెరోనికా—మళ్ళీ అదేమాట!...అదేమాట! నన్ను ఆజ్ఞాపించడానికి నీకేం అధికారంవుంది. నాకు తోచినప్పుడు వెడతాను. (గుమ్మంవేపు వెళుతుంది. ద్వారంవద్దనుంచి) ఏమం!...రైజోవుతో) ముద్దు...

వద్దమ్మ—నీరోగం కుదురుస్తా! (వెళుతుంది.)



సెమ్‌ట్సేవిచ్—ఇగ్నట్! ఒక్క నిముషం నీతో మాట్లాడాలి.

రైజోవు—రోమన్! నేను...నేను...నామాట నమ్ము.

సెమ్‌ట్సేవిచ్—నాకు స్పష్టంగా...ఇంక నకిలీవుండకూడదు...తెలిసిపోవాలి...అగ్గిపుల్లవుందా?

రైజోవు—ఇదిగో...సిగర్ వద్దూ! (జర్మన్ చుట్టల పెట్టెతీస్తాడు.) మంచిరకం!...అల్వాంబ్రా. ఒకటి కాల్చి చూడు.

సెమ్‌ట్సేవిచ్—(చుట్టవెలిగిస్తూ) నాప్రాణం విసుగుతూంది.

రైజోవు...నామాట నమ్ము...

సెమ్‌ట్సేవిచ్—ఏదో తేల్చుకుతీరాలి.. కన్వీయరు అమర్చడం ఎప్పుడు?

రైజోవు—కన్వీయరా? ఇంకా నీ పెళ్ళాన్ని గురించి మాట్లాడుతున్నావనుకుంటున్నా.

సెమ్‌ట్సేవిచ్—ఎందుకూ పనికిరానివస్తువు తెచ్చేదేమిటి?...నీకు వస్తువునాడెంకూడా తెలియనట్లుందే...నాభార్యమాటా...మాఇద్దరికీ సరిపడదని నువ్వూ ఎరుగుదువు...మిగిలినదంతా ఆమె స్వంతవిషయం...విను చెప్తూన్నా...ఇంగా ప్రాజెక్టంతా మళ్ళా తిరిగి నాచేత ప్రారంభింపచేస్తూంది. ఏమిటో గవడగొయ్యి! సర్కసిలట...రెస్టారెంటులట...ఛెక్-రూమ్సట...ఇంకా ఏమేమిటో...ఒకదానికీతలా-తోకాలేదు. నన్నొకటి కట్టమన్నారంటే, ఇంక మీరెవ్వరూ అడ్డురాకూడదు, నాపని నాకు వదిలివెయ్యాలి.

రైజోవు—రోమన్ ఫ్రాంట్సేవిచ్!. విశేషంగా బోధించనక్కరలేదు. నీఅభిప్రాయం తెలిసింది. నీమట్టుకి నువ్వో పెద్దఇంజనీరునని అనుకోవచ్చు కాని, నాకే నీపాటి చదువుంటేనా?...ఎందుకు! లాభంలేదు!...

సెమ్‌ట్సేవిచ్—పోనీ మార్చుకుందాం. నీశ్రామికవర్గజన్మ - ఆపార్టీ కార్డూ నాకియ్యి. నాచదువు నువ్వు తీసుకో. కావాలంటే వెరోనికాని కూడా పుచ్చుకో.

రైజోవు—ఇంకా వెరోనికాయేనా? అది వట్టి అబద్ధమని నీకు తెలియడంలేదూ?

(తెర)

## పదమూడో రంగం.

ఫ్యాక్టరీ మేనేజరు ఆఫీసు. నాలుగోరంగంలో మాదిరిగానే వుంటుంది. బల్లముందు ఇంగా కూర్చుండివుంటుంది. ఒకప్రక్కన మీరా కూర్చుని వుంటుంది. సెమ్ట్సేవిచ్ దగ్గర నిలబడివుంటాడు.

ఇంగా—రోమన్, ప్రాజెక్టులో సవరణలు ఎంతవరకువచ్చేయి? ఈ వేళ ఇయ్యమని చెప్పేనుగా.

సెమ్ట్సేవిచ్—చూసేవూ...

ఇంగా—ఇంకా పూర్తి చెయ్యలేదు? ఏమని చెప్పేను?

సెమ్ట్సేవిచ్—ఇంగా! నావాదన బాగా విని ఆలోచించమని కోరుతూన్నా.

ఇంగా—విన్నాను. చాలును. వాటికి నేను అంగీకరించను.

సెమ్ట్సేవిచ్—కాని – క్షమించు – నర్సరీలు కట్టడానికి చోటు లేదు. పైగా...ఇంకా ఏమిటో చెప్పేవు...ఏవో పావురపుగూళ్ళు కావాలన్నావు...మరి...

ఇంగా—వెర్రిగా మాట్లాడకు! పావురపుగూళ్ళ మాట నేను చెప్పలేదు. నర్సరీలు కట్టితీరాలి.

సెమ్ట్సేవిచ్—కామ్రేడ్ గుర్విచ్ ని సంతోషపెట్టడంకోసం, తీరా "కన్వేయర్" పెట్టడానికి వేసిన ప్లాన్ పాడుచెయ్యమంటావా?

ఇంగా—ఆహాఁ!

మీరా—తప్పదు!

సెమ్ట్సేవిచ్—నీపద్ధతంతా కొత్త. క్షమించు. ఈకొత్తదనం పనిసమయంలో చూపితే చస్తాం.

ఇంగా—కామ్రేడ్! క్రమపడి, నాకు పాఠాలు చెప్పబోకు. ఎప్పుడు ఏలా ప్రవర్తించాలో నీసహాయం లేకపోయినా నేనెరుగుదును.

సెమ్ట్సేవిచ్—కాని, మీపిల్లకి చోటువుండదని తెలియటంలేదూ! అదీగాక ఇది ఫ్యాక్టరీగాని – శిశాలయం కాదుగా.



మీరా—ఇది సోవియటుఫ్యాక్టరీ. ఇక్కడిపనివాళ్ళే దీని యజమానులు. ఇది తెలుసుకోవడం కొంచెం కష్టం. కాదూ?

ఇంగా—మీపిల్లకి నేను చోటుచూపుతాను. అంతేనా?

సెమ్ట్సేవిచ్—అయితే క్షమించు...ఇంక నాఅవసరం వుండదనుకుంటాను.

ఇంగా—కామ్రేడ్! గాడిదలా ప్రవర్తించకు. నువ్వు కొత్తమాదిరి ప్రాజెక్టు నిర్మించలేవు దాయని, స్త్రీజాతికి అత్యవసరమైన నిర్మాణం మానేదానిని కాదు. నర్సరీలకి కావలసినవన్నీ ఇదివరకే జాగ్రత్తపెట్టేను.

సెమ్ట్సేవిచ్ నాబుర్రకి ఏమీ ఎక్కడం లేదు. నేను కొన్ని బూర్జువాభావాలు కలిగివుంటానని నేనూ వొప్పుకుంటాను. 'కన్వేయరు' ఎక్కడ వుంచవలసిందీ చెబితేగాని "ప్లాన్" గియ్యను.

ఇంగా—ఇదివరకే ఓడజనుమార్లు చెప్పేను. ఇంక మాటలు చాలించి, పనికి దిగుదాం.

మీరా—కామ్రేడ్ సెమ్ట్సేవిచ్! అదిలేనిదే పనిసాగదు అబ్బాయి! ఏదో ఆట ఆడుదామనుకున్నావుగాని, ఓడిపోయేవు. నర్సరీలు లేకపోతే నీగొంతు కొరికేస్తా.

సెమ్ట్సేవిచ్—ఓరిదేవుడా! నీకింకా పిల్లలేనా లేరుకాదూ?

మీరా—ఇప్పటికి లేరు!

(వెళ్ళిపోడానికి బయలుదేరుతుంది. గుమ్మంలో డైకోవుతో ఢీకొంటుంది. టెలిఫోను మ్రోగుతుంది.)

ఇంగా—(టెలిఫోనువద్ద) ఔను...హలో దూబోవ్!...క్వార్టర్లెక్కలా?...తయారైనాయి...మూడోబంటాకి అధమం వెయ్యిమందేనా కావాలి జనం...ఎక్కడున్నారు? నిజమే పనిలేంవాళ్ళు ఎవ్వరూ లేరు...సరే, ఆఫీసులోవాళ్ళనే కొందర్ని ఉపయోగించుకుంటాం...టైపిస్టులు.. సరే. ఏదో చేస్తాం. అంతకంటె చెయ్యగలదేముంది? ... ఔనమకో...

మే ఒకటవ తేదీకి 7 గంటలపని ప్రారంభించి తీరాలి. ఏమి కానీ... రెజినల్ కమిటీకి వస్తా... సరే...

(టెలిఫోనులో మాటలాడుతూండగా కొన్ని కాగితాలు తీసుకుని ఒక దూత వస్తాడు. అంతసేపూ సెమ్‌ట్స్నేవిచ్ రైజోవువంక చూసి కన్ను గీటుతూంటాడు. రైజోవు తలవూపుతాడు. ఇంగా రిసీవరు తగిలించి, దూతనుంచి కాగితాలు తీసుకుని, సంతకం పెడుతుంది.)

ఇంగా—మూడో డిపార్టుమెంటులోంచి ఎవర్నైనా ఇక్కడికి పంపు. (దూతి తలవూపి, వెడతాడు.) రోమక్! చూస్తూన్నావా, వాళ్ళు ఏలాగ తరుముతూన్నారో. ఇది ఆఖరుమారు చెప్పడం. రెండురోజులలో 'ప్లాన్' లు నా ఎదట పెట్టాలి కాలేదంటే ఒప్పుకోను.

సెమ్‌ట్స్నేవిచ్—ఇగ్నట్ ఇవానోవిచ్‌కి కూడా కొన్ని సందేహాలున్నాయి.

రైజోవు—అదంతా అనవసరపు ఖర్చని నా అభిప్రాయం!

ఇంగా—అనవసరపుఖర్చా? ఏమిటది?

రైజోవు—ఔను. నర్సరీలకీ – వెన్‌టిలేటర్లకీ డబ్బు ఖర్చుపెట్టేస్తే అసలు భవంతి కట్టడంలో తగ్గించుకోవలసి వస్తుంది.

ఇంగా—భవంతికట్టేటప్పుడు కూలీలసౌఖ్యం చూడాలంటావా?

రైజోవు—అదీసంగతి! ఇప్పుడు తెలిసింది...

ఇంగా—ఏమిటి తెలుస్త?

రైజోవు—అదే! అందరూ అనుకుంటున్న మాటే.

ఇంగా—నీనాటీపోటీమాటలు వదలి తిన్నగా మాట్లాడమని చెప్పేను. నాకు మహాచెడ్డ చిరాకేస్తుంది.

రైజోవు—స్పష్టమే... నేనే ఫ్యాక్టరీకమిటీ అధ్యక్షుడిని అయివుండి, నాస్థానంలో గ్రిచానినో వేవుంటే, అంతా ఇప్పుడు జరుగుతూన్నదానికి వ్యతిరేకంగా జరిగివుండేది.

(సిగరెట్టు వెలిగించి, కోపంతో సిగరెట్టు పెట్టె చప్పుడయ్యేలాగ మూస్తాడు డిమిట్రీ ప్రవేశించి, ఆగి, వింటాడు. సెమ్‌ట్స్నేవిచ్ వెళ్ళిపోబోతాడు.



సెమ్‌ట్స్నేవిచ్—ఏదో తేల్చండి. మళ్ళీ కలుసుకుంటా.

(బయటికి వెడుతూ, తలవోరచేసి ఇంగావైపు చూస్తూ వెడతాడు.)

డిమిట్రీ—మళ్ళీ ఆసంగతేనా?

రైజోవు—(డిమిట్రీతో) సరి, సరి! (ఇంగాతో) అధికారులకి నమస్కారం! గాలిలేకపోతేనూ, నర్సరీలు లేకపోతేనూ ఏలాగాయని మీకు ఆశ్చర్యంగా కనపడవచ్చును, గాని, మేము వెలుతురులేకపోయినా పని చెయ్యడానికి అలవాటు పడ్డాం.

ఇంగా—ఈమాటు మళ్ళీ అన్నావంటే గెంటేస్తా జాగ్రత్త...

రైజోవు—ఓహోహో? నువ్వు గెంటివెయ్యబడకుండా వుంటేను.

ఇంగా—పెట్టీబూర్జువా! నీతో ఒక గదిలో వుండడం కూడా అసహ్యం వేస్తుంది. చెడిపోయేవు!

రైజోవు—చెడిపోయేనూ? కంట్రోల్ కమీషన్ నీ విషయంలో ఏమంటుందో వింటాముకా. నేను చెడిపోయేనేః?

(సోమోవు వస్తాడు.)

సోమోవు—ఏమిటోయ్ ఇగ్నట్? ఆశ్చంగారపు ఆఫీసులో ఏదో జరిగిందంటుంది?

రైజోవు—ఎవరు?

సోమోవు—వెరోనికా. నువ్వు ఆఫీసులో పట్టుకొని చెరిచేవనో – ఏదో ఆలాంటిదే—కొంప ఎగిరిపోయేలాగ అరుస్తుంది.

రైజోవు—నేను?... నేను?... ఆమెని?... గ్రిగరీ...... అల్లాగంటి మాటల నేమనాలో తెలియకుండావుంది... దేవుడితోడుగా చెప్తూన్నా...

(హడావిడిగా సిలువగీసుకోబోతాడు. వేళాకోళంగా సోమోవు పరీక్షిస్తుంటాడు. మధ్యలోనే సిగ్గుపడి రైజోవు ఆగిపోతాడు.)

సోమోవు—ఇగ్నట్! దీని నిజం ఏదో నేను తెలుసుకుతీరుతా నమ్మ. చాలరోజులనుంచి నీవ్యవహారం చూస్తున్నా. ఏమీబాగాలేదు. చెడిపోతున్నావు.

రైజోవు—(డిమిట్రీ- ఇంగాలను వేలితో చూపుతూ) వారిని చూసేవా? ఇది బయటపడ్డా కనుక్కునే వారులేరు. (వెళ్ళిపోతాడు.)

సోమోవు—అసలుసంగతి ఏమిటి?

ఇంగా—నేను స్పష్టంగా అడుగుతున్నా చెప్పు. అతడేనా వుండాలి, నేనేనా వుండాలిగాని, ఇద్దరం ఇక్కడుండడంపడదు, ఈ పేచీతో నా తలబద్దలయిపోతూంది.

సోమోవు—మళ్ళీ వెనకటిగోలే......అర్థంఅయింది...సరే విషయం వచ్చిందిగనక - అతడూ నువ్వూ కూడా ఇక్కడుండకూడదు; అదీ.

డిమిట్రీ—ఇద్దరికీ పోలిక ఏమిటి? ఏ విధంగా చూడు! వాడు పట్టి విషపుపురుగు. ఇంక ఈమెది స్వంతవిషయం.

సోమోవు—అబ్బాయి! స్వంతవ్యవహారాలు అనేవిలేవు. మనకి ప్రతివిషయమూ సామాజిక ప్రాధాన్యతకలదే. మనని నిరంతరం ప్రజా ప్రజాసమూహాలు పరీక్షించిచూస్తూనేవున్నాయి. మనము వారికి ఆదర్శంగా వుండాలి. వేలకొలది జనం మనవంక నిరీక్షిస్తున్నారు. స్వంతవ్యవహారం అంటావేమిటి ఇంకా?

ఇంగా—స్వంతం అనేదిలేదు. నువ్వుచెప్పింది నిజం.

సోమోవు—ఆమాట అన్నావు నాకు చాలా ఆనందంగావుంది, ఏమైనా నువ్వు రైజోవువంటి దానివికావు, నీకు విషయాలన్నీ తెలుసు. (వెళ్ళిపోతాడు)

డిమిట్రీ—అతని మాట నిజమంటావా?

ఇంగా—నువ్వేమంటావు? ఒప్పుకోవా?

డిమిట్రీ—సరేలే. ఆవిషయం వదిలివేద్దాం. చాలదూరం వెడుతుంది.

ఇంగా—సాయంకాలంవరకూ అది నిలుపుదాం. చూశావా. స్వంత వ్యవహారాలు సామాజిక కార్యాలకి ఏవిధంగా అడ్డుతగులుతున్నాయో!

డిమిట్రీ—సరే. ఆపెయ్యి. మనం మొగుడు - పెళ్ళాములమనే సంగతి మరచిపో.



ఇంగా—నావలన ఏంకావలసివుండివచ్చేవు?

డిమిట్రీ—'వెంటిలేటర్లు' బాగుచేయించడం ఎప్పుడేమిటి?

ఇంగా—ఎస్టిమేట్లూ చూసి చెప్తానన్నా కాదూ?

డిమిట్రీ—పంట్లముల శాఖలో ఉష్ణం 25 డిగ్రీలవరకూవుంది. పనివాళ్లు చెమటలు కక్కుతూన్నారు. అలాఅయితే ఊపిరితిత్తులు చెడిపోతాయి...పనిసమ్మె! ఒకదానికొకటి సంబంధంలేకుండా రోజులో ఎన్ని ఆర్డర్లమీద సంతకం పెడుతూన్నానో ఎరుగుదువుకదా? ఇంక వూరుకో తలచుకోలేదు. పనివాళ్ళు నన్ను వేపేస్తూన్నారు. వాళ్ళదేమీ తప్పు లేదు. ఈవ్యవహారం అంతా కూలీరక్షణశాఖకి అప్పచెప్పవలసిన సమయం వచ్చింది. అందరిచేతా వేలుపెట్టి చూపించుకోడం నాకూ బాధగావుంది. చీటికీ - మాటికీ మన ప్రేమ వ్యవహారం ఎత్తుతూంటే నాకూ చాల చీకాకుగావుంది.

ఇంగా—అదిగో మరల స్వంతవిషయాలకి వచ్చేవు!

డిమిట్రీ—ఏదిస్వంతమో, ఏది కాదో నాకేమీ అర్థం కావడం లేదు.

ఇంగా—వెంటిలేటర్లు మూడునెలలలోపున చాల బాగుచేయించుదాము. అది నానిర్ణయం!

డిమిట్రీ—అసంభవం.

ఇంగా—ఏం? స్వంతవ్యవహారాలున్నాయా?

డిమిట్రీ—నీకూ; ఆవ్యవహారాలు!

ఇంగా—అబద్ధం!

డిమిట్రీ—నాకేవీ స్వంతవ్యవహారాలులేవు. చెబుతూన్నా విను. మనం కమ్యూనిస్టులం. మనకి స్వంతం అనేదిలేదు.

ఇంగా—సరయినమాట నేనూ అంగీకరిస్తా. మనవ్యవహారం తేలిపోయినట్లే. బ్యూరోకి ఈపాటికి ఫిర్యాదు పంపుకో.

డిమిట్రీ—ఇంగా! వెక్కిరించుతూన్నావా?

ఇంగా—ఊహుఁ. ఈవూడావిడితో నాప్రాణం విసిగిపోయింది. మనం ఒకరినొకరు నీచపరచుకుంటున్నాం. మన ఉభయులకంటేనూ అత్యుత్తమములయిన విషయాలని నీచపరుస్తున్నాం. ఇది నాఅంతిమసందేశం. నాపనికి అడ్డం రాబోకు. నీధోరణులు - నీఆశలు వదులుకో - లేదా...

డిమిట్రీ—లేకపోతే?

ఇంగా—లేకపోతే ఇంతతో ఆఖరు. నాఇచ్ఛని కట్టిపెట్టే అధికారం ఎవ్వరికీలేదు. ఆవిధంగానే చేస్తూవచ్చేనా అంతా తల్లక్రిందులు చేస్తాను...ఇంక నువ్వు నన్నేమీ చెయ్యలేవు!

డిమిట్రీ—ఇంగా! (ఆమె చెయ్యి పట్టుకోబోతాడు.)

ఇంగా—భావావేశాలకిది సమయంకాదు. నేను నిజంగా చెప్తున్నా. మనకోరికలకికూడా హద్దులున్నాయి.

డిమిట్రీ—నేను నిన్ను విడిచిపెట్టలేను.

ఇంగా—ఏంచెయ్యమంటావు నన్ను? నాకర్తవ్యం - నాపని విడిచిపెట్టివెయ్యమంటావా? ఏమిటి నీఅభిప్రాయం?

డిమిట్రీ—అయితే ఏమంటావు? ఆఖరే?

ఇంగా—నీప్రశ్న అదే అయితే నేను చెయ్యగలది ఒక్కటే! వెళ్లు. నీకోసం పనిమానుకోలేను.

డిమిట్రీ—ఆలోచించుకు చెప్పినమాటేనా?

ఇంగా—నేచెప్పినట్లు చేసేదానినే.

(డిమిట్రీ చేతులతో ముఖం కప్పుకుంటాడు. ఆమె అతనివద్దకు వచ్చి తల నిమురుతుంది. అతడు పలకలేదు. చేయిమాత్రం తోసేస్తాడు.)

డిమిట్రీ—నీప్రేమ ఇంతలోవుందన్నమాట?

ఇంగా—నేను నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో, నిన్ను విడిచిపెట్టడానికి ఎంత బాధపడుతూన్నానో నీకు తెలుసుననుకోను.

డిమిట్రీ—విడిచివేస్తావూ...



ఇంగా—ఔను. చేసినతప్పు ఒప్పుకోవాలి. నిన్ను గ్లఫీరానుంచి వేరుచేసి నేను పెద్దపొరపాటు చేసేను. ఆపని చేయడానికి నాకు ఏవిధమైన - నైతికఅధికారమూలేదు. హృదయబలంతోలొప్పోయి, కేవలం తర్కానికి తావు ఇవ్వడం నాపొరపాటు.

డిమిట్రీ—ఇంగా! ఈఅనుబంధం ఎక్కడిది? ఎందుకొచ్చింది? నువ్వు...ఆలాగ...ఊహుఁ! కేవలం నీకోసమే నిన్ను ప్రేమించేను...

ఇంగా—డిమ్కా!...ఇది ఇల్లా తెగిపోనీయి...ఇంతకంటె కలతలు ముదిరేకంటె ఇక్కడితో తెగిపోవడమేమంచిది. నీకు స్నేహితురాలు - భార్యకావాలి. ఇంక నేనా...ఎంత అధికంగా ప్రేమిస్తూన్నా...కేవలం కామ్రేడ్‌గామాత్రమే ఉండగలను. నేను స్వతంత్రురాలిని...భార్యను కాను...ఉహుఁ. కాజాలను..."స్నేహితురాలిని" కాజాలను. నీలాగే నేనూ ఎంతో బాధపడ్డాను. నేను జయించేను. నీలాగే నేనూ యౌవనురాలిని. ..నాదగ్గరికి మరొకభావంతో నువ్వు వస్తే నేసహించలేను..నన్ను అర్థం చేసుకో. (అతడామె చేయిలాగుతాడు) లే. ఎవరేనా లోపలికి వస్తే మళ్ళీ సిగ్గుపడతావు. (అతడామె చేతులు వదలడు. హఠాత్తుగా ఆమె అతనివైపు ఒరుగుతుంది.) ఇంక ఇదిమార్చలేవు...ధైర్యం తెచ్చుకో...(తలుపు చప్పుడు) ఎవరక్కడ? (గ్లఫీరా వస్తుంది.) ఏంకావాలి?

గ్లఫీరా—(వారిరువురివంకా చూస్తూ) మీకు కబురుపంపేరట కాదూ?...మూడోడిపార్టుమెంటునుంచివచ్చేను.

ఇంగా—ఔనౌను...ఇవి అక్కడికి తీసుకువెళ్ళు. (ఇంగా వ్రాతబల్లవద్దకుపోయి, గ్లఫీరా చేతికి కొన్ని కాగితాలు ఇస్తుంది.)

గ్లఫీరా—ఆలాగే - కామ్రేడ్!

(కాగితాలు తీసుకుంటుంది కాని కదలదు. ఇంగా ఇతరకాగితాలు తీసుకుని బయటకు వెళుతుంది. నిశ్శబ్దం.)

డిమిట్రీ—పేగులు తెంపేసినట్లు అనిపిస్తూంది...మేమిద్దరం విడిపోయేము.

గ్లఫీరా—(పెద్ద ఊర్పు తీసుకుని) విడిపోయేరూ?

డిమిత్రీ—ఆవిడతో వుండడం చాల ఇబ్బందిగావుంది, నన్ను అణిచి వేస్తూంది.

గ్లఫీరా—నువ్వింకా ఆమెని ప్రేమిస్తూనే...

డిమిత్రీ—అలాగయినా నేను భరించలేకుండావున్నా. ఆమెకి తగిన మగవాడు లేడు...అలాంటి ఆడది...అదంతా మరచిపోయి, అంతా వెనకటిమాదిరిగా అయిపోతే బాగుండు ననిపిస్తూంది.

గ్లఫీరా—వెనకనున్నట్లుగా ఎప్పుడూవుండదు.

డిమిత్రీ—ఇంక నువ్వూ ఉపన్యాసం ఇస్తావు కాబోలు!

గ్లఫీరా—నే నిప్పు డెవరనుకుంటున్నావు? వట్టి మొద్దు ననుకుంటున్నావా? కాదు. కామ్రేడ్! నేనిదివరకు వట్టి 'సున్న'గా మాత్రం వుండేదానిని...కాని ఇప్పుడు...సంగతే వేరు. నది మళ్ళీ వెనక్కి ప్రవహించలేదు. నేను ఇదివరకున్న మాదిరిగానే ఎప్పటికీ వుంటా ననుకోబోకు. నన్ను నిజం చెప్పమంటావా? ఎప్పటికో వచ్చేస్తావనే ఆశపడేదాన్ని. ఎప్పుడూ ఆ ఆలోచనే. (కళ్ళు వాలుస్తుంది.) ఆ కాలం అంతా నీతోనే గడిపేను...బహుశా అందుకోసమే అయినట్లు బ్రతికేను. ఈ పనికూడా అందుకే తీసుకున్నాను. కాని, ఆ రోజులు వెళ్ళిపోయేయి. ఇదిగో విను. నువ్వు నాతో వుంటావూ...చాలా బాగు. ఉండవూ...సంతోషం! నాదారి నాకుంది. నాదారికి అడ్డం రావడానికి ఎవ్వరినీ - ఆఖరుకి నిన్నైనాసరే అంగీకరించను.

డిమిత్రీ—బహుశా మరొకణ్ణి చూసుకుని వుంటావు.

గ్లఫీరా—చూసుకొని వుంటానూ? అయితేనేం? నీ వ్యవహారం చూసుకోముందు. నువ్వు మళ్ళీ అన్నీ వెనకటిమాదిరిగానే జరగాలనుకుంటున్నావు. కాని, మిత్రమా! అలా జరగదు. అటువంటి అవకాశం లభించడం కొంతమంది ఆడవాళ్ళకి ఆనందం కలుగచెయ్యవచ్చును. కాని, నేను... బహుశా తెలివితక్కువదానినే కావచ్చునను నీ అంత తెలివి - జ్ఞానం సంపాదించలేకపోవచ్చుననుకో...ఆమాదిరిగా మగవాళ్ళలో కలిసిపోవడానికి అంగీకరించను...ఊహూఁ. నేను ఒప్పుకోను.

…లను. నిను ఇబ్బందికలిగించ… పడుతూన్నాను.

గ్లఫీరా—కామ్రేడ్ రిజ్జక్! ఇది వరకుపడ్డ విచారానికి ఇప్పుడు నేను లెక్కచెయ్యటంలేదు. నిజానికి అప్పుడు బాధగానేవున్నా, దాని మూలంగానే నేను జీవితరహస్యం కనుక్కోగలిగేను! సందేహంలేదు... చూసేవూ వాడిపోయిన నాకణతలు? (చూపుతుంది.) కాని, నాహృదయం లోనికి చూడగలిగితివా, నీమీద కోపం ఏమూలా కనపడదు.

(ఆమె చేయి చాచుకుని ఇంగావంక వస్తుంది. ఒక్కక్షణం విభ్రాంతి. ఆమె కళ్ళలోకి చూస్తూ. ఇంగా ఆమె చెయ్యిపట్టుకుంటుంది. ఆతురతతో వారు కౌగలించుకొని, ముద్దుపెట్టుకుంటారు.)

మీరా—మీరిద్దరూ వట్టి చవటలు. అంతే, చూసేరూ? ప్రపంచ సమస్యలన్నీ తీర్చివెయ్యగలిగేరని ఎవరేనా అనుకోవచ్చు. కాని, మీరు అందరూ కలిసివుంటే—

ఇంగా—మీరా! సమయోచితంగా మాటలాడలేవా?

గ్లఫీరా—అటువంటి అభిప్రాయంవుంటే నువ్వు వుండవచ్చునేమోగాని, మేము వుండలేము. (వెళ్ళిపోతుంది)

మీరా—నా ఇష్టానుసారమే నేను నడుస్తాను. నిన్ను సలహా అడగను.

ఇంగా—మీరా!

-మరొక గాయం!

మీరా—నీకు తగలవలసిందే. గాలిమేడ లెప్పుడూ కట్టబోకు.

ఇంగా— నేనొక యోధురాలినిమాత్రమే కాదు. నాజీవితసర్వస్వం అర్పించదలచుకున్నాను.

మీరా—(అలసేస్తూ) ఉటోపియా!

ఇంగా—నిజానికి బాధగానేవుంది...కాని, మీరా! ముసలాడు నిజంచెప్పేశాడు. ఇప్పుడెంత సుఖంగా వుందనుకున్నావు. నేను నాదానినే అనుకోగలగడంచేత ఎంతో తేలికగావుంది. నేను స్వతంత్రురాలినయ్యాను. కేవలం పార్టీకోసం...ఇదివరకటికన్న తీవ్రంగా పోరాటం సాగించగలగడానికి పూర్తి స్వతంత్రం పొందేను (టెలిఫోను అందుకుంటుంది.) సోమోవుతో కలవండి...ఏ తాతా! నువ్వేనా? నన్ను ఆశీర్వదించు...నువ్వు చెప్పినట్లుగానే జరిగించేను ... అర్థంఅయిందా? ... నువ్వు తెలివిగలవాడివి...పునర్నిర్మాణమార్గంలో అడ్డంగా నిలచిన ప్రతిదీ - బాహ్యంకానీ, ఆంతరికంగానీ, స్వవిషయంగానీ, సామాన్యవిషయంగానీ,- అన్నీ తుడిచివెయ్యబడాలి!...భావోద్రేకాలు కలుగవచ్చును...ఇదంత చులకన అయినదికాదని నీవూ ఎరుగుదువు? కాని, ఏమయితేనేంగాక, ఇంగారిజర్ జీవితసమస్య లింక నిను...



